## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్చంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పీఠిక.

ద్విజులకు విధింపబడిన నిత్యకర్మలలో సంధ్యావందనమునకు ప్రాముఖ్య మధికమని వేరుగ వివరింప నక్కరలేదు. వైదిక కర్మల నన్నిటిని విడచిపెట్టిన యీకాలపు జనులలో ఈ సంధ్యావందన కర్మ యొకటి మాత్రము నిలచి యుండవలసియున్నది. సంధ్యావందనమను పేరనుచ్చరింపబడు మంత్రములన్నిటిలోను గాయత్రీ మంత్రము వేదముల కన్నిటికిని పురాతనమగు ఋగ్వేదముయొక్క మూడవ మండలములోని అఱువది యొకటవ సూక్తమునందలి పదియవ ఋక్కు. ఉపనయనకాలమునందు ఈ మంత్రోపదేశానంతరమున ఉపనీతుడు వేదాభ్యాసమునకు అర్హుడగును. ఈ మంత్రమును ప్రతిద్విజుడును ఉపనయనము మొదలుగ ప్రతిదినము ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము అను మూడు సంధ్యాకాలములందును పఠింపవలెను.

పరమాత్ముని ప్రేరణ లేక ఏమియు జరుగదు. ప్రతిజీవుని మోక్షేచ్ఛానుసారముగ నతని హితము కొఱకు భగవంతుడు శాస్త్రసమ్మతములైన సంధ్యావందనాది క్రియలను చేయించును. పరమాత్ముని ప్రేరణలేనిదే వానిని మనము స్వతంత్రముగ చేయలేము. పరమాత్ముడు నిర్దోష జ్ఞానానంద స్వరూపుడు, సజ్జన సంరక్షణార్థము అవతరించినపుడు కూడ ప్రాకృత దేహరహితుడు, సృష్టి స్థితిలయాదులకు మూలకారణుడు, సర్వవ్యాపి అని మన మెల్లప్పుడు తెలిసికొనవలెను. గాయత్రీ జపకాలమునందు ధ్యాన శ్లోకమునందు వివరింపబడిన భగవద్రూపమును ప్రాణాయామానంతరము నిశ్చల నిర్మల మనస్సుచేత హృదయాకాశమునందు నిలిపి కడపట భగవదర్పణ చేయవలెను. ఇట్లు శాస్త్రసమ్మతములగు సమస్త కార్యముల నాచరించిన వాని ఫలము అనంతమై వృద్ధిపొందును.

ఈ గాయత్రీ మంత్రమును నిష్కపట హృదయుడై నిర్మల భక్తితో జపించువాడు పారలౌకికమగు శక్తిని పొందుననియు, అందుమూలమున సకల కష్టములనుండి తొలగి శత్రువుల జయించి అప్రతిహతుడగుననియు కొందరు తలతురు. ఈమంత్రమున కింతటి మహాత్మ్యము కలుగుటకు కారణమును ఇచట కొంత వివరించెదము.

"తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్" అని మంత్రము. దీని యర్థము వివరించునట్టి మధ్వ భాష్యము ఈ విధముగ నున్నది.

"గుణైస్సతః ప్రసవితా వరణీయో గుణోన్నతేః ।
భారతీ ప్రాణసూపత్వాద్భర్గో ధ్యేయోఽఖిలైర్జనైః ॥
ప్రేరకోఽశేషబుద్ధీనాం స గాయత్ర్యర్థ ఈరితః ।"

**టీ॥** ఏవం యోజనీయమ్. యో నోఽస్మాకం అశేషజీవానాం ధియః **బుద్ధీః** ప్రచోదయాత్ ప్రేరయేత్ తస్యసవితుః దేవస్య నారాయణస్య తత్ గుణైస్తతం తస్మాదేవ వరేణ్యం భర్గోరూపం ధీమహి చింత**యామ ఇతి.** (మధ్వభాష్యమ్)

**అర్థము:**— యః = ఎవడు; నః = అశేషజీవులయొక్క; ధియః = **బుద్ధులను;** ప్రచోదయాత్ = ప్రేరణ చేయుచున్నాడో: (తస్య = ఆ) సవితుః = జగదుత్పత్తిహేతువైన; దేవస్య = నారాయణునియొక్క; తత్ = గుణములచే వ్యాప్తమయిన; వరేణ్యం = ప్రార్థనీయమైన; భర్గః = **రూపమును;** ధీమహి = ధ్యానించెదము.

ఈమంత్రమునకు వ్యాఖ్యాతలు వేలువేలు విధములనర్థముచేసిరి. కాని మొత్తముమీద వారందరును ఈక్రింది విషయములో ఏకీభవింతురు. జీవుని యింద్రియములకు చైతన్యము కలుగజేసి క్రియల కుపకరించునట్లు ప్రేరణచేయు పరమాత్మశక్తి యొకటి అంతర్యామియై యున్నదనియు, ఈ మహాశక్తియొక్క మహిమను మనము ధ్యానింప వలయుననియు

ఈ మంత్రముయొక్క అర్థము. ఈమహాశక్తిని కొందరు విష్ణుస్వరూపమనియు, కొందఱు రుద్రుడనియు, కొందఱు జగదంబ యనియు, వేర్వేరుగ భావింతురు. అయితే శ్రీమన్మధ్వ సిద్ధాంతానుసారముగా శ్రీవిష్ణువే పరమాత్ముడనియు, ఆ మహాశక్తి యనియు నిర్ణయింపబడినది.

ఈమంత్రము సకల వేదాంతసారమును తెలుపుచుండుటచేత దీనికింతటి ప్రాధాన్యము కలిగినదని నాయభిప్రాయము. మనకందఱకును పరమాత్మయే ముఖ్యాధారమనియు, అతని ప్రాపును కరుణయు లేనియెడల మనకెట్టికార్యము చేయుటకును శక్తి చాలదనియు, మన జ్ఞానేంద్రియములుకూడ అతని సహాయ్యములేనిచో పనిచేయజాలవని ఏమతము బోధింపదు? ఇదియే యీ మంత్రముయొక్క అర్థము. ఇంతకంటె నుత్కృష్టమైన పరమాత్మోపాసన యింకొకటిలేదు.

x x x x

శ్రీః

ఈ ఋగ్వేద సంధ్యావందనము మా పితామహులు మ-రా-రా-శ్రీ కీ॥ శే॥ పళ్లె చెంచలరావు పంతులు (C.I.E) గారిచేత పండిత సాహాయ్యమున వ్రాయబడి 1897వ సంవత్సరమున ప్రచురింపబడెను. ఆ పుస్తకములయొక్క ప్రతులు అయిపోయినవి. అందు మంత్రములకు సూర్యాది దేవతాపరమగు అర్థము వ్రాయబడి యుండెను. ఇప్పుడు తత్తద్దేవతాంతర్యామి పరమాత్మ పరముగను మంత్రముల కర్థము వ్రాయబడి యున్నది.

మైసూరు గవర్నమెంటులో రిటైర్డు అసిస్టెంటు సెక్రెటరీగాను, S. M. S. O. సభా ఆనరరీ సెక్రెటరీగానుండి కీర్తిశేషులైన కె. వెంకటరావుగారిచే చాలవరకు ఈపుస్తకము వ్రాయబడి పరిష్కరింపబడి యుండెను, పిమ్మట కారణాంతరములచే నిలచిపోయినది. మదరాసు మైలాపూరులోని కేసరి హైస్కూలులో సంస్కృతాంధ్ర భాషాధ్యాపకులగు సాహిత్యశిరోమణి, విద్వాన్ శ్రీ S. నాగరాజరావుభాస్కర్ గారిచే వ్రాయబడి నూతనావృత్తిగ ముద్రింపబడి యున్నది. వీరిరివురకును నాకృతజ్ఞతను ఇందుమూలమున తెలుపుచున్నాను. దీనికి తోడ్పడిన శ్రీ కంది నారాయణరావు గారికిని, అచ్చు తప్పుల సరిదిద్దినందుకు తిరుపతి వాస్తవ్యులైన శ్రీ "కౌండిన్య" గారికిని, సకాలమునకు పుస్తకములను చక్కగా ముద్రించి మా కందించిన తిరుపతి శ్రీ తిరువేంగడం ప్రెస్సు వారికిన్ని నా కృతజ్ఞతను తెలుపు చున్నాను.

నా జ్యేష్ఠ పుత్రుడు చిరంజీవి చెంచలరావు కుమారుడగు చిరంజీవి ఆనందరావు బ్రహ్మోపదేశ కాలమునందు ఈ పుస్తకము ఆవిష్కరింప బడినది.

తేనాంపేట, మదరాసు-18<br>12—6—1962.

పళ్లె పాణినిరావు.

# ఋగ్వేద సంధ్యా వందనమ్.

## ప్రాతస్సంధ్యా వందనమ్.

శ్రీ గురుభ్యోనమః హరిః ఓం

అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోఽపివా ।
యః స్మరేత్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరం శుచిః ॥

(దీనిని చెప్పుచు శిరస్సుపై నుదకము ప్రోక్షణ చేసికొనుచు సంధ్యా వందనము ప్రారంభింప వలెను.)

| | |
|---|---|
| ఓం కేశవాయ స్వాహా<br>ఓం నారాయణాయ స్వాహా<br>ఓం మాధవాయ స్వాహా | (ఈ నామములను చెప్పుచు మూడు మారులు ఆచమనము చేయవలెను) |
| ఓం గోవిందాయనమః<br>ఓం విష్ణవేనమః | (రెండు హస్తములను కడుగుకొనవలెను) |
| ఓం మధుసూదనాయనమః<br>ఓం త్రివిక్రమాయనమః | (పెదవులను స్పృశింప వలెను) |

---

**Foot-note:**

పగలు రాత్రుల సంధికాలములయిన ప్రాతస్సాయంకాలములందు సూర్యాన్తర్గత పరమాత్మునకు వందనము చేయుటను సంధ్యా వందనమందురు. ఇట్లు సంధ్యా కాలములు రెండని యున్నను ప్రాతర్మధ్యాహ్న సాయంకాలము లనెడి మూడు సంధ్యా కాలములు సంధ్యా వందనమునకు ముఖ్యములైనవి.

ఉపనయనానంతరము బ్రాహ్మణుడు చేయవలసిన నిత్య, నైమిత్తిక కర్మములలో సంధ్యావందన మనునది ముఖ్యమైనది. సూర్య రహితమయిన ప్రాతఃకాలము (నక్షత్రములు కనుబడు సమయము) ను, నక్షత్ర రహితమయిన మధ్యాహ్న సాయంకాలములను సంధ్యా కాలములని చెప్పుదురు. ఆకాలములందు చేయబడు పరమాత్మని పూజ సంధ్యావందన మనబడును. 'అహరహస్సంధ్యా ముపాసీత' 'యే సంధ్యాముపాసతే బ్రహ్మైవ తదుపాసతే' ఇత్యాది ప్రమాణ వచనముల వలన సంధ్యావందనము అవశ్య మాచరింపవలెనని స్పష్టమగుచున్నది.

| | |
|---|---|
| ఓం వామనాయనమః<br>ఓం శ్రీధరాయనమః | (వ్రేళ్ళచే కపోలములను స్పృశింపవలెను) |
| ఓం హృషీకేశాయనమః | (చేతులు కడుగుకొనవలెను) |
| ఓం పద్మనాభాయనమః | (ఐదు వ్రేళ్ళచేత పాదములను ప్రోక్షణ చేయవలెను) |
| ఓం దామోదరాయనమః | (నడిమి వ్రేలిచేత శిరస్సును తాకవలెను) |
| ఓం సంకర్షణాయనమః | (నడిమి వ్రేలిచేత గడ్డము తాకవలెను) |
| ఓం వాసుదేవాయనమః<br>ఓం ప్రద్యుమ్నాయనమః | (చూపుడు వ్రేలిచేతను బొటన వ్రేలిచేతను ఘ్రాణద్వయమును తాకవలెను) |
| ఓం అనిరుద్ధాయనమః<br>ఓం పురుషోత్తమాయనమః | (బొటన వ్రేలిచేతను, పవిత్రపు వ్రేలిచేతను కన్నులను తాకవలెను) |
| ఓం అధోక్షజాయనమః<br>ఓం నారసింహాయనమః | (రెండు చెవులను తాకవలెను) |

---

స్నానానంతరము గోపీచందన నిర్మాల్యాదులను ధరించి పూర్వాభిముఖముగనో లేక ఉత్తరాభిముఖముగనో శుద్ధస్థలమున ఆసనముమీద కూర్చొని అచమనోదకములో యంత్రమును వ్రాసి, 'ఓం కేశవాయనమః' 'ఓం నారాయణాయనమః' 'ఓం మాధవాయనమః' అని ఉచ్చారణము చేయుచు ప్రత్యేకముగా మూడు మారులు శుద్ధ జలమును ప్రాశనము చేయవలెను.




ఆచమనోదకములో వ్రాయవలసిన యంత్రము — మొదట ఉదకములో త్రికోణమును వ్రాసి దానిమధ్యలో ఓంకారమును, కోణ పార్శ్వములందు భూః, భువః, స్వః అను వ్యాహృతులను, కోణాగ్రమునందు ఓంకారమును వ్రాసి పిదప ఆ ఉదకమును ఆచమనము చేయవలెను.

ప్రాతస్సంధ్యా వందనమును రాత్రి కడపటి జాములయొక్క రెండు గడియల కాలములో నక్షత్రములుండు కాలమునందు చేయుట ఉత్తమ కల్పము. నక్షత్రములు

ఓం అచ్యుతాయనమః (నాభి ప్రదేశమును తాకవలెను)

ఓం జనార్దనాయనమః (కరమధ్యముచేత హృదయమును తాకవలెను)

ఓం ఉపేంద్రాయనమః (చేతి కొనచేత శిరస్సును తాకవలెను)

ఓం హరయేనమః
ఓం శ్రీకృష్ణాయనమః } (మూయబడిన చేతితో రెండు భుజములను తాకవలెను)

(1) ప్రణవస్య పరబ్రహ్మఋషిః, పరమాత్మా దేవతా, దైవీగాయత్రీ ఛందః, ప్రాణాయామే వినియోగః।

(2) ఓం భూః, ఓం భువః, ఓం స్వః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం.

---

నవపతని కాలమునందు చేయుట మధ్యమ కల్పము. సూర్యోదయానంతరము చేయుట అధమ కల్పము. మాధ్యాహ్నిక సంధ్యావందనము దినముయొక్క తృతీయ పంచమాంశమందు చేయుట ఉత్తమకల్పము. దీనికి పూర్వముగాని అనంతరముగాని చేయుట మధ్యమ కల్పము. సాయం సంధ్యా వందనము సూర్యాస్తమయమునకు ముందుచేయుట ఉత్తమ కల్పము. అస్తమించిన పిమ్మట చేయుట మధ్యమ కల్పము. నక్షత్రసహితమైన కాలమునందు చేయుట అధమ కల్పము.

(1) ఇది గాయత్ర్యావాహన పూర్వక ప్రాణాయామ మంత్రము. దీనికి గుణపూర్ణుడైన పరమాత్ముడు ఋషి, దైవీగాయత్రీ ఛందస్సు. ఈ మంత్ర ఫల మేమనగా- పూర్వ రాత్రికాలమందు చేసిన పాపము ప్రాతస్సంధ్యాప్రాణాయామము చేతను, పగలు చేసిన పాపము మధ్యాహ్నసాయంసంధ్యాప్రాణాయామముల చేతను నశించును. ఇందులకు ప్రమాణ వచనములు కలవు.

(2) ఈ యేడింటికి సప్తవ్యాహృతులని పేరు. వీనిలో చివరి నాల్గింటికి విశ్వామిత్ర వ్యాహృతులని పేరు. ఇవి యన్నియు ఓంకార పూర్వకముగానే ఉచ్చరింపబడవలెను. ఇవి పరబ్రహ్మ వాచకములు.

ప్రాణాయామ కాలమందు గృహస్థవానప్రస్థాశ్రమములవారు అయిదు వ్రేళ్లచేత ప్రణవ (ఓం) ముద్రచేతను, యతులు, బ్రహ్మచారులు ఓంకార ముద్రానామకమైన అనామికాంగుష్ఠముల చేతను నాసాపుటములను గట్టిగామూసికొని శ్వాసమునుబంధింపవలెను

ఈ ప్రాణాయామము రేచక, పూరక, కుంభకములని మూడు అంగములుగలిగి యున్నది. లోపలి వాయువును దక్షిణ నాసా రంధ్రమునుండి బయటకు విడుచుట రేచక

(1) ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి,
ధియో యోనః ప్రచోదయాత్.

(2) ఓం ఆపో జ్యోతీరసోఽమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్.

(3) శ్రీ గోవింద గోవింద శ్రీ మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమ పాదే భరతవర్షే భరతఖండే జంబూద్వీపే దండకారణ్యే గోదావర్యాః దక్షిణే తీరే శాలివాహన శకే బౌద్ధావతారే రామక్షేత్రే అస్మిన్ వర్తమానే వ్యావహారిక చాంద్రమానేన.........సంవత్సరే.........అయనే.........ఋతౌ.........మాసే.........పక్షే.........తిథౌ .........వాసరయుక్తాయాం శుభ నక్షత్ర శుభయోగ శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ భారతీరమణముఖ్యప్రాణాంతర్గత సవితృనామక శ్రీ లక్ష్మీనారాయణ ప్రేరణయా శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యా ముపాసిష్యే.

---

మనియు, బయటి వాయువును వామ నాసారంధ్రమునుండి లోపలకు తీసికొనుట పూరకమనియు, వాయువును నిశ్చలముగా ధారణచేయుట కుంభక మనియు చెప్పబడుచున్నవి.

ఓం = గుణపూర్ణుడైన పరమాత్ముడు ఓంకారమనబడును. భూః = గుణపూర్ణుడు. భువః = నిరవధిక శ్రేష్ఠుడు. (సంపదాది దాయకుడు) స్వః = సుఖ స్వరూపుడు. మహః = శ్రేష్ఠుడుగ పూజింపదగినవాడు. జనః = సృష్టికర్త. తపః = జ్ఞానస్వరూపుడు. సత్యం = ముక్తాముక్త నియామకుడు.

(1) ఇది గాయత్రి. సంధ్యావందనమునకు ముఖ్యమైన మంత్రము. యః = ఏ పరమాత్ముడు; నః = మనయొక్క; ధియః = బుద్ధులను; ప్రచోదయాత్ = ప్రేరణ చేయుచున్నాడో; తస్య = అట్టి; సవితుః = సృష్ట్యాద్యష్టకర్తయగు; దేవస్య = పరమాత్మునియొక్క; వరేణ్యం = అందరిచేత భజనీయమైన; తత్ = గుణములచేత వ్యాప్తమయిన; భర్గః = క్రీడాజ్ఞాన స్వరూపుడైన పరమాత్మునియొక్క స్వరూపమును; (తేజస్సును) ధీమహి = ధ్యానము చేయుదము.

(2) ఇది శిరోమంత్రము. ఆ సవితృనామక పరమాత్ముడు; ఆపః = సమస్త జగత్పాలకుడు; జ్యోతిః = ప్రకాశరూపుడు; రసః = సారభోక్త. అమృతం =

(మార్జనము ఎడమ చేతియందు ఉద్ధరిణిలో ఉదకమును పెట్టుకొని తులసీ దళములచేత శిరస్సుపైన ఈ క్రింది మంత్రములను చెప్పుచు ప్రోక్షణ చేసికొనవలెను.)

(1) ఆపోహిష్ఠేతి త్ర్యర్చస్య సూక్తస్య సింధు ద్వీపఋషిః,
ఆపో దేవతా, గాయత్రీ ఛందః, మార్జనే వినియోగః.

(2) ఓం ఆపోహిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన,
మహేరణాయచక్షసే.

(3) యోవశ్శివతమో ర సస్తస్యభాజయతేహ-నః,
ఉశతీరివమాతరః.

---

మరణరహితుడు; భూః = గుణపూర్ణుడు; భువః = నిరవధి కైశ్వర్యవంతుడు; స్వః = సుఖస్వరూపుడు. ఓం బ్రహ్మ = ఇట్టి గుణపూర్ణుడైన పరమాత్మని; (ధీమహి ధ్యానము చేయుదము.)

(3) ఈవేళకాలములందు ఇటువంటి కర్మమును చేసెదమని మనస్సును దృఢపఱచుటయే సంకల్పము. భగవత్ప్రీతి కొఱకు మనము చేయు ప్రతినిత్యము కర్మమును పరమాత్మనకు సమర్పింపవలెను.

(1) ఇది మార్జనమంత్రము. 'ఆపోహిష్ఠా........ఆపోజన యథాచనః' అను నీ మూడు ఋఙ్మంత్రములకు సింధు ద్వీపులనువారు ఋషి. అప్శబ్దవాచ్యుడైన పరమాత్మ దేవత, గాయత్రి ఛందస్సు, మార్జనమునందు దీనికి వినియోగము. ఈ మంత్రములు ఉదక దేవతాపరముగాను, పరమాత్మ పరముగాను అర్థము నిచ్చుచున్నది.

(2) ఉదక దేవతాపరము :—

హి = ఏకారణమువలన; ఆపః = ఓ ఉదకములారా! (మీరు) మయోభువః = సుఖమునిచ్చువారుగా; స్థ = అగుదులో; తాః = అటువంటి మీరు; నః = మాకు ఊర్జె = అన్నమును; దధాతన = ఇండు; మహే = శ్రేష్ఠమయిన: రణాయ = రమణీయమైన; చక్షసే = జ్ఞానమును; (ఇండు) (ఋ. ౧౦-౯-౧)
పరమాత్మపరము :— ఆపః = ఉదకాంతర్గతుడును అప్శబ్దవాచ్యుడును నగు ఓ పరమాత్మా!; హి = ఏకారణమువలన; మయోభువః = సుఖమునిచ్చువాడుగ; స్థా = అగుదువో; తాః = అటువంటి నీవు; నః = మాకు; ఊర్జె = అన్నమును; దధాతన = ఇమ్ము; మహే = శ్రేష్ఠమయిన; రణాయ = రమణీయమైన; చక్షసే = మోక్షసాధనమైన జ్ఞానమును. భక్తిని; (ఇమ్ము)

(4) తస్మా అరంగమామవో యస్యక్షయాయజిన్వథ. ఆపోజనయథాచనః.

(అరచేతిలో కొంచెము ఉదకము పెట్టుకొని యీ మంత్రము చెప్పిన పిమ్మట ఆ ఉదకమును ప్రాశనము చేయవలెను.)

(1) సూర్యశ్చేత్యస్య మంత్రస్య నారాయణఋషిః, సూర్యమామన్యు మన్యుపతయో దేవతాః, ప్రకృతిశ్ఛందః, జలాభిమంత్రణే వినియోగః.

---

(3) ఉదకదేవతాపరము :— (ఓ జలములారా!) వః = మీయొక్క; యఃరసః = ఏ రసము; శివతమః = అత్యంత సుఖకరమో; ఇహ = ఇచ్చట; తస్య = దానిని (ఆరసమును) నః = మాకు; భాజయత = ఉపయోగముచేయుడు; ఉశతీః = (పుత్ర సమృద్ధిని) కోరునట్టి; మాతర ఇవ = తల్లులవలె; (రసమునిండు) (ఋ. ౧౦-౯-౨)

పరమాత్మపరము :— (ఓ స్వామీ!) వః = నీయొక్క; శివతమః = అత్యంత మంగళకరమయిన; యః = ఏ; రసః = శ్రేష్ఠమైన ఆనందము గలదో; ఇహ = ఇచ్చట; తస్య = ఆ ఆనందమును; నః = మాకు; మాతరః = తల్లులు; ఉశతీః ఇవ = తమకు జనించిన శిశువులను ప్రీతితో స్తన్యాదులనిచ్చి రక్షించునట్లు; భాజయత = పొందునట్లు చేయుము.

(4) ఉదకదేవతాపరము :— ఆపః = ఓ ఉదకములారా! (మీరు) యస్య = ఏ పాపముయొక్క; క్షయాయ = నాశముకొఱకు; (అస్మాన్ = మమ్ములను) జిన్వథ = తృప్తిచేయుచున్నారో; తస్మై = దానికొఱకు; అరం = త్వరగా; వః = మిమ్ము; గమామ = ప్రోక్షణ చేయుచున్నాము; ఆపః = ఓ ఉదకములారా; నః = మమ్ములను; జనయథాచ = పుత్ర పౌత్రాది జననమునందు ప్రేరింపుడు.

(ఋ. (౧౦-౯-౩)

పరమాత్మపరము :— ఆపః = ఓ ఉదకాంతర్గత నారాయణా! (నీవు) యస్య = ఏ పాపముయొక్క; క్షయాయ = నాశనముకొఱకు; వః = నీ దయారసముతో; జిన్వథ = పొందించెదవో; తస్మై = ఆ ఆనంద లోకములకు; అరం = త్వరగా; గమామ = పోయెదము; ఆపః = అప్శబ్దవాచ్యుడైన ఓ పరమాత్మా! నః = మమ్ములను; జనయథాచ = ఆ ఆనందస్వరూపమునందు నివసించునట్లు చేయుము.

(1) 'సూర్యశ్చ' అని ప్రారంభమగు నీ మంత్రమునకు నారాయణుడు ఋషి, మన్యుపతిఅయిన రాత్రి నియామక దుర్గాదేవి దేవత. ప్రకృతి ఛందస్సు. జలాభిమంత్రణమునందు వినియోగము. జ్ఞానులకు మోక్షము నిచ్చు పరమాత్మను, క్రోధాభిమాని బ్రహ్మరుద్రాది దేవతలను పాపములనుండి రక్షించుటకై ఈ ఉదకమును అభిమంత్రించెదను.

(1) ఓం సూర్యశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః, పాపేభ్యో రక్షంతాం యద్రాత్ర్యా పాపమకార్షం మనసావాచా హస్తాభ్యాం పద్భ్యా ముదరేణశిశ్నా రాత్రి స్తదవలుంపతు. యత్కించ దురితంమయి ఇదమహం మామమృతయోనౌ సూర్యే జ్యోతిషిజుహోమి స్వాహా. (మరల ఆచమనము చేయవలెను. కేశవాయస్వాహా........ శ్రీకృష్ణాయనమః)

(1) ఆపోహిష్ఠేతి నవర్చస్య సూక్తస్య, సింధుద్వీపః, అంబరీషోవా; ఆపో దేవతా, గాయత్రీ ఛందః, పంచమీ వర్ధమానా, సప్తమీ ప్రతిష్ఠా, అంత్యేద్వే అనుష్టుభౌ, పునర్మార్జనే వినియోగః.

---

(1) సూర్యాదిపరము, పరమాత్మపరము :— సూర్యఃచ = సూర్యుడు; సూర్య నియామకుడును జ్ఞానులచేత పొందబడువాడును నగు పరమాత్ముడు; మన్యుః చ = క్రోధాభిమానిరుద్రుడు; మన్యుపతయఃచ = క్రోధనియామక దేవతలు; మన్యుకృతేభ్యః = కోపమువలన చేయబడిన; పాపేభ్యః = పాపములనుండి; మా = నన్ను; రక్షంతాం = రక్షింతురుగాక; రాత్ర్యా = రాత్రియందు; మనసా = మనస్సుచేతను; వాచా వాక్కుచేతను; హస్తాభ్యాం = హస్తములచేతను; పద్భ్యాం = పాదములచేతను; ఉదరేణ = కడుపుచేతను; శిశ్నా = శిశ్నముచేతను; యత్ పాపం = ఏ పాపమును; అకార్షం = చేసితినో; తత్ = దానిని; రాత్రిః = రాత్ర్యభిమానిదేవత; అవలుంపతు = పరిహరించుగాక; మయి = నాయందు; యత్ కించ = ఇకనేమైన; దురితం = పాపము (కలదో) ఇదం = దీనిని; మాం = నన్ను; అహం = నేను; అమృతయోనౌ = మరణరహితమయిన యోనిగానుండు; సూర్యేజ్యోతిషి = సూర్యజ్యోతిస్సునందు; అమృతయోనౌ = మరణరహితుడును మూలభూతుడును మోక్షదాయకుడును నగు; సూర్యేజ్యోతిషి = ప్రకాశరూపుడైన పరమాత్మయందు; జుహోమి = హోమము చేయుచున్నాను. (అందునకుగాను ఈజలము) స్వాహా = హోమము చేయబడినది యగుగాక. (తై. ఆర. ౧౦-౨౪)

(1) 'ఆపోహిష్ఠా.............సంస్నృజవర్చసా' వఱకు గల తొమ్మిది ఋక్కులకు సింధుద్వీపులు, అంబరీషులు అనువారు ఋషులు. జలాభిమాని దేవతగల యీ సూక్తములకు గాయత్రి ఛందస్సు. అయిదవ ఋక్కుకు వర్ధమాన ఛందస్సు. ఏడవ ఋక్కుకు ప్రతిష్ఠా ఛందస్సు. కడపటి రెండు ఋక్కులకు అనుష్టుప్ ఛందస్సు. మరల మార్జనమునందు దీనికి వినియోగము.

(1) ఓం ఆపోహిష్ఠా.........ఆపోజనయథాచనః (1-3)

(4) శన్నోదేవీరభిష్టయ ఆపోభవంతు పీతయే ।
శంయో రభిస్రవంతునః ॥

(5) ఈశానా వార్యాణాం క్షయంతీశ్చర్షణీనాం ।
ఆపో యాచామి భేషజం ॥

---

(1) ఆపోహిష్ఠా..........అను ఈ మూడు మంత్రములకు వెనుక అర్థము వ్రాయబడినది.

(4) ఉదకదేవతాపరము :— నః = మనకు; శం = సుఖము: భవంతు = కలుగుగాక: దేవీః = క్రీడాదిగుణ విశిష్టలగు; ఆపః = ఓ ఉదకాభిమాని దేవతలారా! అభిష్టయే = అభీష్టసిద్ధికొఱకు; పీతయే = పానముకొఱకు; (ఉపయోగింపుడు) శం = రోగశమనమును; (సుఖప్రాప్తిని) యోః = రోగ ప్రతిబంధమును; (చేయుడు) అభి = మాపైన; స్రవంతు = (శుద్ధికొఱకు) ఉదకమును చల్లుడు. (ఋ. ౭-౬-౫-౪) పరమాత్మపరము :— దేవీః = క్రీడాదిగుణ విశిష్టుడగు; హేఆపః = అప్ శబ్దవాచ్యుడగు ఓ పరమాత్మా! నః = మాకు; అభిష్టయే = సర్వాభీష్టప్రాప్తికొఱకు; పీతయే = పానముకొఱకు; లేక రక్షణముకొఱకు; శం = సుఖము కొఱకును; (అనగా కేవలము ఈ లోకముయొక్క అభీష్టప్రాప్తికొఱకు అనియేకాదు. మోక్షసుఖమును; నః = మాకు; యోః = దుఃఖనాశనమును; స్రవంతు = ఇచ్చువాడు; భవంతు = అగుగాక.

(5) ఉదకపరము :— వార్యాణాం = ఉదకములకు; లేక ఉదకములందు పుట్టునట్టి వరి మొదలగు ధాన్యములకు; ఈశానాః = అధిపతులగు ఉదకాభిమాని దేవతలారా! చర్షణీనాం = మనుష్యులగు మాయొక్క; క్షయంతీః = (పాప) నాశకమైన; భేషజం = సంసార నివారకమగు ఔషధమును; అపః = ఉదకమువలన; యాచామి = ప్రార్థించెదను. (ఋ. ౭-౬-౫-౫) పరమాత్మపరము :— అహం = మార్జనకర్తయగు నేను; ఆపః = అప్శబ్దవాచ్యుడగు ఓ పరమాత్మా! నిన్నుగూర్చి; భేషజం = హృదయగ్రంథి విమోచకమగు సంసార పరిహారకమగు ఔషధమును; యాచామి = ప్రార్థించెదను: నీవు, నీ సంబంధులగువారు (దేవతలు) వార్యాణాం = నివారించు సామర్థ్యముగల వారిలో; ఈశానాః = శ్రేష్ఠులయినవారు; మరియు నీవు, నీ భక్తులగు దేవతలు ఎట్టివారనగా — చర్షణీనాం = ద్విపాద చతుష్పాద ప్రాణుల యొక్క; క్షయంతీః = నివాసకారణ భూతులయినవారు; (అనగా ప్రాణులయొక్క పూర్వకృత పాపకర్మ ప్రాప్తములగు రోగాదులను నశింపజేయువారని యర్థము)

(6) అప్సుమేసోమో అబ్రవీదంతర్విశ్వాని భేషజా ।
అగ్నించ విశ్వశంభువం ॥

(7) ఆపః పృణీత భేషజం వరూథం తన్వే౽మమ ।
జ్యోక్చ సూర్యం దృశే ॥

(8) ఇదమాపః ప్రవహత యత్కించ దురితంమయి ।
యద్వాహమభిదుద్రోహ యద్వాశేప ఉతానృతం ॥

---

(6) ఉదకపరము :— అప్సు = ఉదకములయొక్క: అంతః = మధ్యయందు; విశ్వాని = సమస్తములగు; భేషజాః = ఔషధములను; విశ్వశంభువం = ప్రపంచము నకు సంపూర్ణ సుఖము నిచ్చునట్టి: అగ్నించ = అగ్ని: (ఉన్నాడని) సోమః = చంద్రుడు; మే = నాకు; అబ్రవీత్ = చెప్పెను. పరమాత్మపరము :— అప్సు అంతః = ఉదకమునందు ఆవిర్భూతుడైన ధన్వంతరినామక పరమాత్మయందు· విశ్వాని = వివిధములయిన: భేషజాః = ఔషధములు; (ఉన్నవని) మే = నాకు; సోమః = సోమశబ్దవాచ్యుడగు భగవంతుడు; (లేక జ్ఞాని) అబ్రవీత్ = చెప్పెను. (అందుచేత యాచించెదను) విశ్వ = ప్రపంచమునకు; శం = సుఖమును; భువః = ఇచ్చునట్టి; అగ్నించ = అగ్నినామక పరమాత్మను కూడ (యాచించెదను.) (ఋ. ౧౦—౯—౬)

(7) ఉదకపరము :— ఆపః = ఓ ఉదకాభిమాని దేవతలారా!; మమ = నా సంబంధమగు; తన్వే = శరీరముకొఱకు; వరూథం = రోగనివారకమైన; భేషజం = ఔషధమును; పృణీత = (దానముచేసి) పూర్ణముచేయుడు; జ్యోక్ చ = జ్ఞానమును; సూర్యం = సూర్యునిని; దృశే = చూచుటకు; (మేము సమర్థులగుదుము) (ఋ. ౧౦—౯—౭)

పరమాత్మపరము :— హే ఆపః = ఓ అప్శబ్దవాచ్యుడగు పరమాత్మా ! మమ తన్వే = నాదేహము నందుండునట్టి అరిషడ్వర్గాది సమస్త పాపములను; జ్యోక్చ = పోగొట్టి; భేషజం = ఔషధరూపమయిన నీ జ్ఞానమును; పృణీత = దానముచేసి, తత్ప్రయుక్తమగు అపరోక్ష జ్ఞానముద్వారా, సూర్యం = జ్ఞానులచే పొందదగిన సూర్యాంతర్గత లక్ష్మీనారాయణుని; దృశే = చూచెదను. (అనగా పొందెదనని యర్థము) (ఈరీతిగ) వరూథం = అందరిచేత ప్రార్థింపబడుచున్నది.

(8) ఉభయపరము :— ఆపః = ఓ ఉదకాభిమాని దేవతలారా ! (ఓ పరమాత్మా) (ఈ దేహము నాశ్రయించి) యత్కించ = ఏదైన: (నాయందు) దురితం = అజ్ఞాన రూపమగు పాపము; (ఏదైన ఉన్నచో) వా = లేక; అహం = నేను; యత్ = ఏదైనను; అభిదుద్రోహ = దేవతలను లేక దైవభక్తులను ద్రోహము చేసి

(౯) ఆపో అద్యాన్వచారిషం రసేన సమగస్మహి।
పయస్వానగ్న ఆగహి తం మా సంసృజ వర్చసా॥

* నసృషీ స్తదపసో దివా నక్తంచ నసృషీః।
వరేణ్య క్రతూరహమాదేవీ రవసే హువే॥

---

యున్నచో దానిని; వా = లేక; యత్ శేపే = శాపమును పాటించక ఇచ్చి యుంచినచో దానిని; ఉత = మరియు; అనృతం = హరిభక్తుల విషయమై అబద్ధమాడి యున్నచో; ఇదం = దానిని; (ఆసర్వపాపములను నాయందు దయయుంచి) ప్రవహాత = మీ ప్రవాహమున తీసికొనిపొండు. (అనగా సంపూర్ణముగా పరిహరింపుమని యర్థము) (ఋ. ౭—౬—౫—౮)

(౯) ఉభయపరము :— ఆపః = ఓ ఉదకాభిమాని దేవతలారా! (ఓ పరమాత్మా!) (నేను) అద్య = ఈ సూర్యాస్తమయకాలమునందు; అన్వచారిషం = (మిమ్ము లనే) ప్రవేశించుచున్నాను; (పూజ్యులని అనుసరించెదను.) రసేన = ఉపకారము చేత (భగవదనుగ్రహముచేత) సమగస్మహి = మిళితుడైయున్నాను: పయస్వాన్ = ఉదకాభిమానిదేవతా సహవాసముతో నున్న; (ఉదకమునందుండు) అగ్నే = ఓ అగ్నీ! (అగ్నిశబ్దవాచ్యపరమాత్మా!) (నీవు) ఆగహి = రమ్ము: (నా హృదయమున సన్నిధానము చేయుము) తం = అట్టి; మాం = నన్ను; వర్చసా = కాంతితో లేక జ్ఞానముతో; సంసృజ = కలుపుము లేకచేర్చుము. అనగా తెలిసియు తెలియకయు చేసిన నా సర్వపాపములను పరిహరింపుమని యర్థము.)

* దీనికి ఖిలమంత్రమని పేరు. దీనిని కూడ పఠించుచు ప్రోక్షణ చేసికొనవలెను.

ఉదకపరము :— అహం = నేను; దివానక్తంచ = రాత్రింపగళ్లు; నసృషీః = ప్రవహించువారును; తదపసః = సోమాదిరూపముచేత స్వర్గాదులను సంపాదించువారును; వరేణ్యక్రతూః = శ్రేష్ఠమయిన యజ్ఞాదిక్రతువులు గలవారును! దేవీః = ప్రకాశించు వారును నగు ఉదకాభిమాని దేవతలను; అవసే = నారక్షణకొఱకు; అహువే = ఆహ్వానించెదను.

పరమాత్మపరము :— ఆపః = ఓ పరమాత్మా! దివా = పగలు చేయబడిన పాపమును; నక్తంచ = రాత్రియందు చేయబడిన పాపమును; నసృషీః = పరిహ రింపుము; దేవీః = ప్రకాశరూపుడగు ఓ పరమాత్మా! వరేణ్యక్రతౌ = పరమశ్రేష్ఠ రూపమైన యీ సంధ్యాకార్యమునందు; అవసే = నా రక్షణకొఱకు: దేవీః = క్రీడాది రూపుడగు: ఆపః = అప్శబ్దవాచ్యుడగు నీయందు; హువే = సమర్పించెదను. (నీకు శరణాగతుడను.)

(ఈ మంత్రముచేత జలము నభిమంత్రించి నాసిక యొద్దకు తీసికొని వెళ్ళి తనకు ఎడమ ప్రక్కగా భూమిమీద విడచిపెట్టవలెను.)

(1) ఋతంచ సత్యం చేత్యస్య మంత్రస్య । అఘమర్షణ ఋషిః ।
భావవృత్తో దేవతా । అనుష్టుప్ ఛందః ।
పాప పురుష విసర్జనే వినియోగః ॥

(2) ఓం ఋతంచ సత్యం చాభీద్ధా త్తపసో ధ్యజాయత ।
తతోరాత్రిరజాయత । తతస్సముద్రో అర్ణవః ॥

(3) సముద్రాదర్ణవాదధి సంవత్సరో అజాయత ।
అహోరాత్రాణి విదధద్విశ్వస్య మిషతో వశీ ॥

---

(1) 'ఋతంచ సత్యంచ' అను నీమంత్రమునకు అఘమర్షణులు ఋషి. భావవృతులు దేవత అనుష్టుప్ ఛందస్సు. పాప పురుష విసర్జనమునందు దీనికివినియోగము.

(2) ఉభయపదము :— అభీద్ధాత్ = అంతటను ప్రకాశించుచుండు పరబ్రహ్మనుండి; తపసః = తపస్సుకంటె (ఆలోచనకంటె) అధి = అనంతరమునందు; ఋతంచ = సత్యమయిన (సంకల్పమును,) కారణమును; సత్యంచ = సత్యమైన కార్యమును (వాక్కును) (బాధకరహితమగు సమస్తజగత్తు) అజాయత = పుట్టెను; తతః = తచ్ఛబ్దవాచ్యుదగు నా పరబ్రహ్మనుండి; రాత్రిః = రాత్రికాలము (రాత్ర్యభిమానిదేవత) (రాత్రి శబ్దవాచ్యురాలగు గాయత్రి, సావిత్రి, సరస్వతి అజాయత = పుట్టెను; తతః = పిమ్మట (ఆపరబ్రహ్మనుండి) అర్ణవః = ఉదకముతోగూడిన: సముద్రః = సముద్రము (తదభిమానిదేవత) (మహత్తత్త్వాభిమానియగు అతిశయిత జ్ఞానసుఖ బలరూపుడగు చతుర్ముఖ బ్రహ్మదేవుడు) అజాయత పుట్టెను.

(ఋ. ౧౦—౧౯౦—౧)

(3) అర్ణవాత్ = ఉదకముతోగూడిన; సముద్రాత్ అధి = సముద్రమునకంటె అనంతరమునందు (సముద్రాభిమానిదేవత కంటెను) సంవత్సరః = సంవత్సరము (తదభిమాని బ్రహ్మాండాభిమాని చతుర్ముఖబ్రహ్మ) అజాయత = పుట్టెను; (సః = అట్టి పరమాత్మ) అహోరాత్రాణి = రాత్రిం పగళ్లను; విదధత్ = కలుగజేసినవాడై; మిషతః = నిమేషాదులతోగూడిన; విశ్వస్య = సకలప్రాణులకు; వశీ = స్వామిగా: (వర్తతే = ఉన్నాడు.) (ఋ. ౧౦—౧౯౦—౨)

(4) ధాతా = సృష్టికర్తయగు పరమాత్మ; సూర్యా చంద్రమసౌ = సూర్య చంద్రులను; యథాపూర్వం = మునుపటివలెనే; (పూర్వకల్పమునందు వలె) అకల్ప

(4) సూర్యాచంద్ర మసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్ ।
దివంచ పృథివీం చాంతరిక్షమథోస్వః ॥

కేశవాయస్వాహా............శ్రీకృష్ణాయనమః, ప్రణవస్య పర బ్రహ్మఋషిః........భూర్భువస్స్వరోం ॥ పూర్వోక్తైవంగుణ విశేషణ శివిష్టాయాం శుభతిథౌ భారతీరమణ ముఖ్య ప్రాణాంతర్గత సవితృనామక శ్రీ లక్ష్మీనారాయణ ప్రేరణయా శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం ప్రాత స్సంధ్యార్ఘ్య ప్రదానం కరిష్యే.

(1) గాయత్ర్యా విశ్వామిత్రఋషిః, సవితా దేవతా, గాయత్రీ ఛందః, ప్రాతస్సంధ్యార్ఘ్య ప్రదానే వినియోగః (పై చెప్పబోవు మంత్రము చెప్పుచు శుద్ధజలమునందు (ఆచమనము చేయని జలము నందు) ప్రక్కన చూపబడిన విధముగ వ్రాసి ఆజల మును రెండుచేతుల నిండుగ వేసికొని మూడుమారులు అర్ఘ్యము నీయవలెను.)

ఓం
స్వః వం భూః
హ్రీం
భువః

* ఓం భూర్భువస్స్వః ఓం తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్.
కాలాతీత దోషప్రాయశ్చిత్తార్థం ప్రాయశ్చిత్తార్ఘ్య ప్రదానంకరిష్యే

---

యత్ = సృష్టించెను; అథో = అనంతరము; దివంచ = స్వర్గలోకమును; పృథివీంచ = భూమిని; అంతరిక్షం = ఆకాశమును; స్వః = (స్వర్గలోకమునందున్నట్టి) స్వర్గ భోగములను; (అతిశయ సుఖములతో గూడిన మహరాది లోకములను, తదభిమాని దేవతలను;) అకల్పయత్ = సృష్టించెను. (ఋ. ౧౦—౧౯౦—౩)

(1) ఓం భూరిత్యాది గాయత్రీ మంత్రమునకు విశ్వామిత్రులు ఋషి. సూర్యుడు దేవత గాయత్రీ ఛందస్సు. ఈమంత్రమునకు అర్ఘ్యప్రదానమునందు వినియోగము.

* ఈ మంత్రార్థము ఇదివరకు వివరింపబడియున్నది.

'పూర్వాం సంధ్యాం సనక్షత్రా ముత్తరాంస దివాకరాం' అను ప్రమాణము ననుస రించి నక్షత్రయుక్త కాలమున నర్ఘ్యము నిచ్చుట యుత్తమము. అట్లు లేనిచో ఈ మంత్రమును చెప్పుచు మరియొకమారు అర్ఘ్యము నీయవలెను.

ఓం భూర్భువస్స్వః......ప్రచోదయాత్॥

(1) హృదయస్థాతు గాయత్రీ హృద్గతా ముఖనిస్సృతా। హత్వా చాదిత్యశత్రూంశ్చప్రవిశ్య హృదయంమమ ॥ అసావాదిత్యో బ్రహ్మ॥ (ఈ మంత్రమును చెప్పుచు కుడిచేతిలో ఉద్ధరణి జలము వేసికొని క్రిందికి వదలుచు ఒక ప్రదక్షిణచేసి కూర్చొనవలెను.)
కేశవాయస్వాహా..........శ్రీకృష్ణాయనమః ॥

(2) అపసర్పంతు ఇత్యస్యమంత్రస్య వామదేవో భూతాన్యనుష్టుప్। భూతోచ్చాటనే వినియోగః ॥ అపసర్పంతు యేభూతా యేభూతా భువిసంస్థితాః । యేభూతా విఘ్నకర్తారస్తే నశ్యంతు శివాజ్ఞయా ॥ అపక్రామంతు భూతాద్యాః క్రూరాశ్చైవతు రాక్షసాః ॥

యే చాత్ర నివసంత్యేవ దేవతా భువి సంతతం।
తేషామప్యవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥
(అని ఛోటికాముద్రచేత వామభాగమున భూతోచ్చాటన చేయవలెను)

---

(1) హృదయస్థా = నా హృదయమునందుండి; ముఖనిస్సృతా = ముఖము నుండి వెడలిన; హృద్గతా = హృదయమునందుండు; గాయత్రి = ఓ గాయత్రీ;; ఆదిత్యశత్రూంశ్చ = సూర్యుని శత్రువులను; హత్వాచ = చంపి; మమ = నాయొక్క; హృదయం = హృదయమును; ప్రవిశ = ప్రవేశింపుము. అసౌ = ఈ; ఆదిత్యః = సూర్యాన్తర్గత (సూర్య నియామక) పరమాత్ముడు; బ్రహ్మ = గుణపూర్ణుడు.

(2) 'అపసర్పంతు' అను నీమంత్రమునకు వామదేవనామక పరమాత్ముడు ఋషి. అనుష్టుప్ఛందస్సు. భూతోచ్చాటనమునందు దీనికి వినియోగము.

భువి = భూమియందు; సంస్థితాః = వసించుపట్టి; యేభూతాః = ఏ భూతములు గలవో; విఘ్నకర్తారః = సత్కార్యమునకు విఘ్నము చేయునట్టి; యే భూతాః = ఏ భూతములు గలవో; తే = అవి; శివాజ్ఞయా = భూతగణముల కధిపతియగు శివుని యాజ్ఞచే; నశ్యంతు = నశించుగాక; క్రూరాశ్చ = క్రూరులగు; రాక్షసాః = రాక్షసులు (మొదలుగాగల) భూతాద్యాస్తు = భూతములుగూడ; అపక్రామంతు = వెళ్ళిపోవుగాక; అత్ర భువి = ఈ నేను కూర్చొని యున్నచోట; అన్యే = ఇతరములగు; యే దేవతాః = ఏ దేవతలు; సంతతం = ఎల్లప్పుడు; నివసంతి = నివసించుచున్నారో:

(1) పృథివ్యా మేరూపృష్ఠఋషిః। కూర్మోదేవతా। సుతలంఛందః। ఆసనే వినియోగః॥ ఓం పృథ్వీత్వయాధృతాలోకాః దేవిత్వం విష్ణునాధృతా। త్వంచధారయమాందేవి పవిత్రం కురుచాసనమ్॥ మాంచ పూతంకురు ధరే నతోఽస్మితాంసురేశ్వరి॥ ఓం భూర్భువస్స్వరోం అనంతాసనాయనమః (ఈమంత్రమును చెప్పి వస్త్రము నుండి యొకదారమును తీసి తనక్రింద ఆసనముగా వేసికొనవలెను)

(2) ఓమిత్యేకాక్షరంబ్రహ్మ। అగ్నిర్దేవతా బ్రహ్మ ఇత్యార్షం। గాయత్రం ఛందం పరమాత్మంసరూపం। సాయుజ్యం వినియోగం॥

---

(తాళ్ళు = వారుకూడ) అపసర్పంతు = నాదగ్గఱకు వత్తురుగాక; తేషామపి = ఆ దేవతాదులకు గూడ; అవిరోధేన = విరోధము లేకుండునట్లు; బ్రహ్మకర్మ = దేవపూజను. లేక వేదోక్తకర్మను; సమారభే = ఆరంభించెదను.

(1) పృథివీ అను నీ మంత్రమునకు మేరూపృష్ఠులు ఋషి. కూర్మదేవత. సుతలము ఛందస్సు. ఆసనము వేసికొనుటయందు దీనికి వినియోగము. పృథ్వి = ఓ భూదేవీ!; లోకాః = ఊర్ధ్వాదో లోకములు; త్వయా = నీచేత; ధృతాః = ధరింపబడియున్నవి; దేవి = ఓ పృథ్వీదేవీ!; త్వం = నీవు; విష్ణునా = విష్ణువుచేత; ధృతా = ధరింపబడియున్నావు; దేవి = ఓ దేవీ!; త్వంచ = నీవైనను; మాం = నన్ను; ధారయ = ధరింపుము; ఆసనం = నా ఆసనమును; పవిత్రం = పవిత్రమునుగా; కురు = చేయుము; ధరే = ఓ భూదేవీ!; మాంచ = నన్నుకూడ; పూతం = పవిత్రునిగా; కురు = చేయుము; సురేశ్వరి = ఓ దేవతా శ్రేష్ఠురాలా!; త్వాం = నిన్ను; నతోఽస్మి = నమస్కరించెదను; అనంతాసనాయ = శేషశాయి యగు పరమాత్మునికొఱకు; నమః = నమస్కారము; ఓం = నీవు పరబ్రహ్మవు; భూః = గుణపూర్ణుడవు; భువః = నిరవధికైశ్వర్య శ్రేష్ఠుడవు; స్వః = సంపూర్ణ సుఖస్వరూపుడవు; ఓం = ఓంకార నామకుడవు.

(2) ఓమితి = ఓం అనునది; ఏకాక్షరం = ఒక యక్షరమగు; బ్రహ్మ = వేదము; (లేక ఓంకారనామక పరమాత్ముడు ముఖ్యుడైన నాశరహితుడైన పరబ్రహ్మ స్వరూపుడు) అగ్నిః = అగ్నిదేవత; దేవతా = దేవత: బ్రహ్మఇతి = గుణపూర్ణుడగు పరబ్రహ్మ; ఆర్షం = ఋషి; గాయత్రం = గాయత్రి; ఛందం = ఛందస్సు; పరమాత్మం = పరబ్రహ్మ; సరూపం = (ఓంకారమునకు) స్వరూపము; సాయుజ్యం = మోక్షమునందు: వినియోగం = వినియోగము.

(1) ఆయాతు వరదాదేవీ అక్షరం బ్రహ్మసమ్మితం ॥

(2) గాయత్రీ ఛందసాంమాతేదం బ్రహ్మజుషస్వ మే ।
యదహ్నాత్కురుతే పాపం తదహ్నాత్ప్రతి ముచ్యతే ।
యద్రాత్ర్యాత్కురుతే పాపం తద్రాత్ర్యాత్ప్రతి ముచ్యతే ॥

(3) సర్వవర్ణే మహాదేవి సంధ్యావిద్యే సరస్వతి ॥

(4) ఓజోఽసి సహోఽసి బలమసి భ్రాజోఽసిదేవా నాంధామనామాసి ।
విశ్వమసి విశ్వాయు . స్సర్వమసిసర్వాయురభిభూరోం గాయత్రీ

---

(1) ఇదిగాయత్ర్యాహ్వాన మంత్రము. దీనికి వామదేవనామక పరమాత్మ ఋషి. గాయత్రీ ప్రతిపాద్యుడును సూర్యాన్తర్గతుడును నగు నారాయణుడు దేవత. అనుష్టుప్ఛందస్సు. ఈ మంత్రముచేత గాయత్రి నాహ్వానింపవలెను.

వరదా = అభీష్టముల నిచ్చునట్టి; దేవీ = దేవత; అక్షరం = నాశరహితమై; సమ్మితం = నిశ్చయింపబడిన; బ్రహ్మ = పరబ్రహ్మనుగూర్చి (అట్టి పరబ్రహ్మను బోధించుటకొఱకు) ఆయాతు = వచ్చుగాక ;

(2) ఛందసాం = వేదములకు; మాతా = తల్లియైన; గాయత్రీ = ఓగాయత్రీ దేవీ! ఇదం = ఈ; బ్రహ్మ = పరబ్రహ్మను; మే = నాకు; జుషస్వ = ఉపదేశింపుము. అహ్నాత్ = అహస్సువలన; యత్ = ఏ; పాపం = పాపమును; కురుతే = చేయుచున్నాడో; తత్ = ఆపాపము; అహ్నాత్ = అహస్సువలన (అహర్నియామక పరమాత్మవలన) ప్రతిముచ్యతే = పోగొట్టబడుచున్నది; రాత్ర్యాత్ = రాత్రివలన; యత్ = ఏ; పాపం = పాపము; కురుతే = చేయుచున్నాడో; తత్ = ఆపాపము; రాత్ర్యాత్ = రాత్రివలన (రాత్రినియామక పరమాత్మవలన) ప్రతిముచ్యతే = పోగొట్టబడుచున్నది.

(3) సర్వవర్ణే = సమస్త వర్ణములుగల; సంధ్యావిద్యే = సంధ్యాదేవతయైన; సరస్వతి = సరస్వతియను పేరుగల; మహాదేవి = ఓ గాయత్రీదేవీ! (గాయత్రీనామక పరమాత్మా!)

(4) (త్వం = నీవు) ఓజః = బలహేతువుగా అసి = ఉన్నావు; సహః = (శత్రువులను) తిరస్కరించెడి శక్తిగా; అసి = ఉన్నావు; బలం = సామర్థ్యముగా; అసి = ఉన్నావు; భ్రాజః = దీప్తిగా; అసి = ఉన్నావు; దేవానాం = దేవతలయొక్క; ధామనామా = తేజస్సు పేరుగా కలిగినటువంటి వాడుగా; అసి = ఉన్నావు; విశ్వం = సమస్త ప్రపంచమున వ్యాప్తుడై; అసి = ఉన్నావు; విశ్వాయుః = జగత్తుకు సంపూర్ణమగు ఆయుస్స్వరూపుడుగ; అసి = ఉన్నావు; సర్వం = సమస్త ప్రపంచ నియామ

మావాహయామి । సావిత్రీ మావాహయామి ।
సరస్వతీ మావాహయామి । ఛందర్షీనావాహయామి ।
శ్రియమావాహయామి । బలమావాహయామి ॥

(1) గాయత్ర్యా గాయత్రీ ఛందో విశ్వామిత్రఋషిస్సవితా దేవతా ।
అగ్నిర్ముఖం బ్రహ్మ శిరో విష్ణుర్హృదయం రుద్రశ్శిఖా పృథివీ
యోనిః । ప్రాణాపా నవ్యానోదాన సమానస ప్రాణాశ్వేతవర్ణా
సాంఖ్యాయనసగోత్రా గాయత్రీ చతుర్వింశత్యక్షరాత్రి పదా
షట్ కుక్షిః । పంచశీర్షోపనయనే వినియోగః ॥

---

కుడై; అసి = ఉన్నావు; సర్వాయుః = సర్వజీవన హేతువుగా; (అసి = ఉన్నావు) అభిభూః = పాపిజనులకు తిరస్కార హేతువయియు; ఓం = ఓంకార రూపుడగు గుణపూర్ణుడై; అసి = ఉన్నావు; గాయత్రీం = ఇట్టి గాయత్రీనామక పరమాత్ముని; ఆవాహయామి = ఆవాహనము చేయుచున్నాను; సావిత్రీం = సావిత్రీనామక పరమాత్మను; ఆవాహయామి = ఆవాహనము చేయుచున్నాను; సరస్వతీం = సరస్వతీ నామక పరమాత్మను; ఆవాహయామి = ఆవాహనము చేయుచున్నాను; ఛందర్షీన్ = ఛందస్సులను ఋషులను నియమనము చేయు గాయత్రీ రూపమును; ఆవాహయామి = ఆవాహనము చేయుచున్నాను; శ్రియం = లక్ష్మీదేవిని; బలం = బలాభిమాని వాయు దేవతను; ఆవాహయామి = ఆవాహనము చేయుచున్నాను.

(1) గాయత్ర్యాః = గాయత్రికి; గాయత్రీ = గాయత్రీ యనునది; ఛందః = ఛందస్సు; విశ్వామిత్ర ఋషి = విశ్వామిత్రులు ఋషి; సవితా = సూర్యుడు; దేవతా = దైవతము; అగ్నిః = పావకాంతర్యామి పరశురాముడు; ముఖం = ముఖస్థానము; బ్రహ్మ = చతుర్ముఖాంతర్గత విష్ణువు; శిరః = శిరస్సు; విష్ణుః = మహావిష్ణువు; హృదయం = హృదయస్థానము; రుద్రః = రుద్రాంతర్గత సంకర్షణుడు; శిఖా = శిఖాస్థానము; పృథివీ = భూమి; యోనిః = యోనిస్థానాంతర్గతవరాహరూపుడు విష్ణువు; గాయత్రీ = గాయత్రి; ప్రాణాపా నవ్యానోదాన సమానా = ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములను నట్టి పంచప్రాణములు గలది; సప్రాణా = దేవదత్త, కూర్మ, కృకర, ధనంజయ, నాగములనునట్టి పంచోపప్రాణములు కలది; శ్వేతవర్ణా = తెల్లని వర్ణము కలది; సాంఖ్యాయనసగోత్రా = సాంఖ్యాయన గోత్రమునందు అభివ్యక్తమైనది; చతుర్వింశత్యక్షరా = ఇరువది నాల్గు అక్షరములు గలది; (కేశవాది చతుర్వింశతి భగవద్రూపములు గలది;) త్రిపదా = మూడు పాదములు గలది; (నారాయణ, వాసుదేవ, వైకుంఠాది అంశత్రయము కలది) షట్కుక్షిః = ఆరు రూపములు కలది; పంచశీర్షా = వ్యాకరణ, శిక్షా, కల్ప, నిరుక్త, జ్యోతిషములను నట్టి

ఓం భూః............భూర్భువస్స్వరోమ్.

(1) తత్సవితుః అంగుష్ఠాభ్యాం నమః। వరేణ్యంతర్జనీభ్యాం నమః।
భర్గోదేవస్య మధ్యమాభ్యాం నమః। ధీమహి అనామికాభ్యాం నమః।
ధియోయోనః కనిష్ఠికాభ్యాం నమః। ప్రచోదయాత్ కరతల
కరపృష్ఠాభ్యాం నమః॥ తత్సవితుః హృదయాయనమః।
వరేణ్యం శిరసేస్వాహా। భర్గోదేవస్యశిఖాయై వౌషట్।
ధీమహికవచాయహుం। ధియోయోనః నేత్రాభ్యాం వౌషట్।
ప్రచోదయాత్ అస్త్రాయఫట్। భూర్భువస్స్వరోమితిదిగ్బంధః॥
ఆగచ్ఛవరదే దేవి జపేమే సన్నిధౌభవ।
గాయంతం త్రాయసే యస్మాద్గాయత్రీ త్వంతతః స్మృతా॥

---

అయిదు శిరస్సులు గలది; ఇట్టి గాయత్రీ నామక పరమాత్మ(యొక్క) ఉపనయనే = అనుసంధానమున (ధ్యానమును) వినియోగః = వినియోగము (చేయుచున్నాను)

(1) ఈమంత్రమును చెప్పుచు గాయత్రీ మంత్ర జపన్యాసమును చేయవలెను. తత్సవితుః....నమః (చేతుల రెండు బొటనవ్రేళ్ళను తాకవలెను) వరేణ్యం (చూపుడు వ్రేళ్ళను తాకవలెను ( భర్గోదేవస్య (నడిమి వ్రేళ్లను తాకవలెను) ధీమహి (ఉంగరపు వ్రేళ్లను తాకవలెను) ధియోయోనః (చిటికెన వ్రేళ్లను తాకవలెను) ప్రచోదయాత్ (అర చేతులను మోచేతులను తాకవలెను) ఇది కరన్యాసము.

అంగన్యాసము :— తత్సవితుః.... (హృదయమును స్పృశింపవలెను) వరేణ్యం .... (శిరస్సును తాకవలెను) భర్గోదేవస్య.... (తలపై నిగను తాకవలెను) ధీమహి .... (రెండు మోచేతులను చేతులతో తాకవలెను) ధియోయోనః.... (రెండు నేత్రములను తాకి తాళము మాదిరి చేతులు తట్టవలెను) ప్రచోదయాత్........ (శిరస్సుకు చుట్టు కుడిచేతిని త్రిప్పి చెయిమిద చెయి తట్టవలెను) భూర్భువ... ధః (దిక్కులన్నిటిని బంధించినటుల భావన చేయవలెను)

వరదేదేవి = శ్రేష్ఠమైన దేవీ. ఆగచ్ఛ = రమ్ము. మే = నాయొక్క. జపే = జపమునందు. సన్నిధౌభవ = సన్నిహితురాలు అగుగాక; యస్మాత్ = ఏకారణము వలన. గాయంతం = గానము చేయువానిని. త్రాయసే = కాపాడెదవో. తతః = ఆ కారణమువలన. త్వం = నీవు. గాయత్రీ = గాయత్రీఅని. స్మృతా = చెప్పబడినావు.

అస్య శ్రీగాయత్రీమంత్రస్య విశ్వామిత్రఋషిః, సవితృనామక శ్రీనారాయణోదేవతా, శ్రీలక్ష్మీనారాయణ ప్రసాదసిద్ధ్యర్థేజపేవినియోగః ధ్యానం. ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణ స్సరసిజాసనసన్నివిష్టః। కేయూరవాన్మకరకుండలవాన్కిరీటీ హారీ హిరణ్మయవపుర్ధృత శఙ్ఖచక్రః॥ ప్రోద్యదాదిత్యవర్ణాభస్సూర్య మండలమధ్యగః,

---

అస్య = ఈ, శ్రీ = సంపద్యుక్తమైన, గాయత్రీమంత్రస్య = గాయత్రీ మంత్రమునకు, విశ్వామిత్రఋషిః = విశ్వామిత్రఋషి, సవితృనామక శ్రీ లక్ష్మీనారాయణః = సవితాఅను పేరుగల శ్రీ లక్ష్మీనారాయణుడు, దేవతా = దేవత, శ్రీ లక్ష్మీనారాయణ ప్రసాద సిద్ధ్యర్థే = శ్రీ లక్ష్మీనారాయణుని అనుగ్రహము సిద్ధించుటకుగాను, యథాశక్తి = నాయొక్క శక్తికి అనుగుణముగా, జపే = జపమునందు, వినియోగః = తొడగెదను, సదా = సర్వకాలములయందు, ధ్యేయః = ధ్యానమునకు విషయుడు, సవితృమండలమధ్యవర్తీ = సూర్యమండలాంతర్గతుడు, సరసిజాసన = పద్మాసనమునందు, సన్నివిష్టః = కూర్చొనినవాడు, కేయూరవాన్ = బాహువులలో కేయూరముధరించినవాడు, మకరకుండలవాన్ = కర్ణభూషణముల గలవాడు, కిరీటీ = కిరీటము ధరించినవాడు, హారీ = కంఠమందు వనమాలాది హారములను ధరించినవాడు, హిరణ్మయవపుః = హిరణ్మయాత్మక దేహముగలవాడు, ధృతశంఖచక్రః = శంఖచక్రములను ధరించినవాడు, ప్రోద్యదాదిత్యవర్ణాభః = ఉదయించు సూర్యుని కాంతిగలవాడు, సూర్యమండలమధ్యలో నుండువాడు, చక్రశంఖధరః = పై రెండుహస్తములలో చక్రశంఖములను ధరించువాడు, అంకస్థదోర్ద్వయ = క్రింద రెండుచేతుల జానువుపైన పెట్టుకొన్నవాడు, ధ్యేయపేవచ = ధ్యానము జేయదగినవాడు.

సవితృనామక శ్రీ లక్ష్మీనారాయణ ప్రేరణయా = సవితా అను పేరుగల శ్రీలక్ష్మీనారాయణుని ప్రేరణవలన, శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం = శ్రీ లక్ష్మీనారాయణుని ప్రీతికొఱకు, యథాశక్తి = నాయొక్క శక్తికి అనుగుణముగా, గాయత్రీమంత్రజపం = గాయత్రీమంత్రజపమును, కరిష్యే = చేసెదను.

గాయత్రీ జపకాలమందు ఈ క్రింద చెప్పువానిని గమనింపవలెను.

1. జపకాలమందు నవ్వుట, ఇతరులతో మాటలాడుట, గట్టిగా పలుకుట, ప్రక్కలుజూడుట, కాళ్లమీదకాళ్లు, చేతిమీదచెయ్యి వేసికొనుట మనస్సున ఇతర విషయముల చింతచేయుట, నాభిక్రింద ప్రదేశము తాకుట-ఇవన్నియును మానవలెను.

2. సమాహిత మనస్కుడుగా జపము చేయవలెను.

3. ప్రాతః సంధ్యా జపము పూర్వాభిముఖముగా నిలుచుకొని, సూర్యునిజూచుచు, మాధ్యాహ్నిక సాయం సంధ్యా జపములు కూర్చొని చేయవలెను.

చక్రశంఖధరోంకస్థ దోర్ద్వయో ధ్యేజ్ఞయ ఏవచ, సవితృనామక శ్రీలక్ష్మీ నారాయణప్రేరణయా సవితృనామక శ్రీలక్ష్మీనారాయణప్రీత్యర్థం యథా శక్తి గాయత్రీమంత్రజపం కరిష్యే.

(ఇది 1000, 10001 మారులు జపము చేయవలెను.)

(పునః ప్రాణాయామ, కరన్యాస, షడంగన్యాస, ఋషి ఛందస్సులను చెప్పి, ధ్యానముచేసి)

అనేనగాయత్రీ జపకరణేన భగవాన్ సవితృనామక శ్రీ లక్ష్మీ నారాయణః ప్రీయతాం ప్రీతోభవతు. ప్రాతః సంధ్యాంగ శ్రీగాయత్రీ మంత్ర జపః సంపూర్ణః ॥ శ్రీకృష్ణార్పణమస్తు॥

---

4. జపకాలమందు జపముచేయు చేతులు బైట కనబడకూడదు. చేతులు మూసుకొనుటయే గాక వస్త్రముతో అచ్ఛాదించి వ్రేళ్ల రంధ్రము విడవకుంత చేసి సంఖ్యా క్రమముగుందు జపము చేయవలెను.

5. జపకాలమందు గాయత్రీమంత్రమును 'ఓం భూర్భువః స్వః। ఓం తత్సవితుర్వరేణ్యం। భర్గో దేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్।' అని మూడు స్థలములందు నిలిపి ఉచ్చరించవలెను.

6. జపము వాచిక (ఉచ్ఛ నీచ స్వరములో చెప్పుట), ఉపాంశుక (పెదవులను ఆడించుచు ఇతరులకు వినబడనట్లు చెప్పుట), మానసిక (అక్షరములు, వర్ణములు, పదములు ధ్యానించి శబ్దార్థమును మనస్సులో ధ్యానము చేయుట) అని మూడు విధములు; వాచికమునకంటె ఉపాంశుకము అధిక ఫలప్రదమైనది. ఉపాంశుకమునకంటె మానసికము అత్యుత్తమమైనది.

7. గాయత్రీ జపము మాలాకారముగా (వ్రేళ్లగణుపులతో) చేయవలెను. అనామికాంగులియొక్క మధ్యగ్రంథినుండి ప్రదక్షిణాకారముగా తర్జని కొనవరకు నగు పది గ్రంథులను ఎంచవలసినది. మధ్యమాంగులియొక్క మధ్యమ మరియు కొనగ్రంథులను విడువవలెను.

8. ప్రాతః సంధ్యాంగ జపము నాభిప్రదేశమునకు ఎదురుగాను, సాయం సంధ్యాంగ జపము నాసికాగ్రమునకు ఎదురుగాను చేతులు క్రిందకి పొడుగుగా చాచి జపము చేయవలెను.

9. సంధ్య ప్రారంభించిన స్థళములోనే జపము చేయవలసినది.

(తూర్పు ముఖముగా నిలచికొని)

జాతవేదస ఇత్యస్య మంత్రస్య, మరీచిపుత్రః కశ్యపఋషిః జాతవేదాగ్నిర్దేవతా, త్రిష్టుప్ఛందః, సంధ్యోపస్థానే వినియోగః.

ఓం జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతి వేదః, సనఃపర్షదతి దుర్గాణివిశ్వానావేవసింధుం దురితాత్యగ్నిః. ఓం తచ్ఛం యోః శంయుఋషిః. విశ్వేదేవా దేవతా, శక్వరీఛందః, శాంత్యర్థే జపే వినియోగః.

---

10. గాయత్రీంతు పరిత్యజ్య యోన్యంమంత్రముపాసతే।
మాండూకరావాస్తే జ్ఞేయా ఇతివేదవిదోవిదుః ॥
కుర్యాదన్యంనవా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే।
తస్మాన్నిత్యం హరిం ధ్యాయన్ కుర్యాత్సావిత్ర్యయ మంజసా ॥
ఏకాహం జపహీనశ్చ సంధ్యాహీనోదినత్రయే।
ద్వాదశాహ మనగ్నిశ్చ శూద్రఏవ న సంశయః ॥

అను ప్రమాణములవలన దేనిని విడిచినను సంధ్యాంగ గాయత్రీ జపము మాత్రము విడువరాదు.

'జాతవేదస' అను మంత్రమునకు కశ్యపుడు ఋషి, జాతవేదాగ్ని దేవతా, త్రిష్టుప్ ఛందస్సు. ఉపస్థానమంత్రమును ఉచ్చారణ చేసెదను.

జాతవేదసే = (జ్ఞానహేతువైన) అగ్నికొఱకు, (పరమాత్మనికొఱకు) సోమం = సోమలతను, సునవామ = పిండుదము. వేదః = (సర్వజ్ఞుఁడైన) అగ్ని, (పరమాత్ముడు) అరాతీయతః = (మాయందు) శత్రుత్వము కోరెడి పురుషులను, నిదహాతి = దహించుచున్నాఁడు. సః = ఆయగ్ని, (పరమాత్ముడు) నః = మాయొక్క, విశ్వా = సమస్తమైన, దుర్గాణి = విపత్తులను, సింధుం = సముద్రమును, నావాఇవ = ఓడచేతవలెనే, అతిపర్షత్ దాఁటించుఁగాక.

'తచ్ఛంయో' అను మంత్రమునకు, శంయు అనువాడు ఋషి, విశ్వే దేవులుదేవత, శక్వరీ ఛందస్సు పరమాత్మని శరణు చెందుటకు మంత్ర జపము చేసెదను.

శం = ప్రాప్తమైన రోగములకు నివారకమైన, యోః = ముందురాఁగల రోగములకు నివారకమైన, తత్ = దానిని (అపుణకేతక మనెడు కర్మమును), ఆవృణీమహే = అభిముఖ్యముగా ప్రార్థించుచున్నారము. యజ్ఞాయ = ఆపుణ కేతిక చయనమందు చేయఁబడు ఉత్తర శత్రువునకు, గాతుం = గతినిగా ప్రార్థించుచున్నారము.)

ఓం తచ్ఛంయోరావృణీమహే, గాతుం యజ్ఞాయ, గాతుం యజ్ఞపతయే, దైవీ స్వస్తిరస్తునః, స్వస్తిర్మానుషేభ్యః, ఊర్ధ్వం జిగాతుభేషజం, శన్నోఅస్తు ద్విపదే శం చతుష్పదే.

నమోబ్రహ్మణ ఇత్యస్యమంత్రస్య వామదేవోఋషిః, లింగోక్త దేవతా । త్రిష్టుప్ఛందః । సంధ్యోపస్థానే వినియోగః ॥

ఓం నమోబ్రహ్మణే నమోఽ స్త్వగ్నయే నమః పృథివ్యైనమ ఓషధీభ్యః. నమోవాచే నమోవాచస్పతయే నమో విష్ణవే మహతేకరోమి.

---

యజ్ఞపతయే = యజమానునికి, గాతుం = ఫలప్రాప్తిని, గూర్చి (ప్రార్థించుచున్నాము) దైవీస్వస్తిః = దేవతలచేత సంపాదింపఁబడిన క్షేమమే, నః = మాకు, అస్తు = కలుగ నిమ్ము. మానుషేభ్యః = మనకొమానులకు, స్వస్తిః = (అట్టి) క్షేమము (కలుగ నిమ్ము) ఊర్ధ్వం = ఇంక మీఁదను, భేషజం = సర్వారిష్ట నివారణము, జిగాతు = (మమ్ము) పొందనిమ్ము, నః = మాయొక్క, ద్విపదే = మనుష్యులకొఱకు, శం = సుఖము, అస్తు = కలుగుఁగాక. చతుష్పదే = పశువులకొఱకు, శం = సుఖము (కలుగుగాక).

'నమోబ్రహ్మణే' అను మంత్రమునకు వామదేవుడు ఋషి. లింగోక్త దేవతా, త్రిష్టుప్ ఛందస్సు. సంధ్యా ఉపస్థానము చేయతగినది.

బ్రహ్మణే = వేదముకొఱకు, నమః = నమస్కారము, అగ్నయే = అగ్నికొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక. పృథివ్యై = పృథివికొఱకు. నమః = నమస్కారము. ఓషధీభ్యః = ఓషధులకొఱకు, నమః = నమస్కారము. వాచే = వాగింద్రియముకొఱకు, నమః = నమస్కారము. వాచస్పతయే = బృహస్పతికొఱకు, నమః = నమస్కారము. మహతే = పూజింపఁదగిన, విష్ణవే = విష్ణువుకొఱకు, నమః = నమస్కారమును, కరోమి = చేయుచున్నాను.

బ్రహ్మగ్న్యాది శబ్దవాచ్యుడగు పరమాత్మునకు నమస్కరించుచున్నాను.

ప్రాచ్యైదిశే = తూర్పుదిక్కుకొఱకు, నమః = నమస్కారము. ఏతస్యాం = దీనియందు, యాః చ = ఏ, దేవతాః = దేవతలు, ప్రతివసన్తి = వసించుచున్నారో, ఏతాభ్యః చ = ఈదేవతలకొఱకును, నమః = నమస్కారము. దక్షిణాయైదిశే = దక్షిణదిక్కుకొఱకు, నమః = నమస్కారము. ఏతస్యాం = దీనియందు, యాశ్చ దేవతాః = ఏదేవతలు, ప్రతివసన్తి = వసించుచున్నారో, ఏతాభ్యః చ = ఈ దేవతల కొఱకును, నమః = నమస్కారము. ప్రతీచ్యైదిశే = పశ్చిమ దిక్కుకొఱకు, నమః = నమస్కారము. ఏతస్యాం = దీనియందు, యాశ్చదేవతాః = ఏ దేవతలు

ఓం నమః ప్రాచ్యైదిశే యాశ్చదేవతాః ఏతస్యాంప్రతి వసంతి ఏతాభ్యశ్చ నమోనమః, ఓం నమః దక్షిణాయై దిశే యాశ్చదేవతాః ఏతస్యాం ప్రతివసంతి ఏతాభ్యశ్చ నమోనమః ఓం నమః ప్రతీచ్యైదిశే యాశ్చ దేవతాః........నమోనమః, ఓం నమః ఉదీచ్యై దిశే యాశ్చ దేవతాః....నమోనమః, ఓంనమః ఊర్ధ్వాయైదిశే యాశ్చదేవతాః.... నమోనమః, అధరాయైదిశేయాశ్చ దేవతాః....నమో నమః, అవాంతరాయై దిశే యాశ్చదేవతాః....నమోనమోగంగాయమునయోర్మధ్యే యే వసంతితేమే ప్రసన్నాత్మానశ్చిరంజీవితం వర్ధయంతి నమో గంగాయమునయోర్మునిభ్యశ్చనమః, సంధ్యాయైనమః సావిత్ర్యై నమః గాయత్ర్యై నమః, సరస్వత్యైనమః, సర్వాభ్యో దేవతాభ్యోనమః, మునిభ్యో నమః,

---

ప్రతివసన్తి = వసించుచున్నారో, ఏతాభ్యః చ = ఈదేవతల కొఱకును, నమః = నమస్కారము. ఉదీచ్యైదిశే = ఉత్తరదిక్కుకొఱకు, నమః = నమస్కారము. ఏతస్యాం = దీనియందు, యాః చ దేవతాః = ఏ దేవతలు, ప్రతివసన్తి = వసించుచున్నారో, ఏతాభ్యః చ = ఈదేవతలకొఱకును, నమః = నమస్కారము. ఊర్ధ్వాయైదిశే = ఊర్ధ్వదిక్కుకు (ఆదేవతలకు) నమః = నమస్కారము అధరాయైదిశే = అధోదిక్కుకు (అచ్చటి దేవతలకు) నమః = నమస్కారము. అవాంతరాయైదిశే = ఆగ్నేయాదికోణదిక్కులకొఱకు, నమః = నమస్కారము. ఏతస్యాం = దీనియందు, యాః చ దేవతాః = ఏదేవతలు, ప్రతివసన్తి = వసించుచున్నారో, ఏతాభ్యః చ = ఈదేవతలకొఱకును, నమః = నమస్కారము. గంగాయమునయోః = గంగాయమునలయొక్క, మధ్యే = మధ్యదేశమునందు, యే = ఎవరు: వసన్తి = వసించుచున్నారో (తేభ్యః = వారలకొఱకు), నమః నమస్కారము. తే = వారలు, ప్రసన్నాత్మానః = ప్రసన్నహృదయులై, చిరం = దీర్ఘమైన, జీవితం = ఆయుస్సును, వర్ధయంతి = వృద్ధిపొందింతురుగాక. గంగాయమునయోః = గంగాయమునలయందుండెడి, మునిభ్యః చ = మునులకొఱకును, నమః = నమస్కారము.

కామః = రాగము, అకార్షీత్ = చేసెడి, మన్యుః = క్రోధము, అకార్షీత్ = చేసెడి. (దేవతులకును), నమోనమః = నమస్కారము.

భూమి, ఉదకము, తేజస్సు, వాయువు, ఆకాశము, ఈ అభిమాని దేవతలకు, భగవతే = ఐశ్వర్యాదిషడ్గుణ సంపన్నుడైన, వాసుదేవాయ = వాసుదేవనామక పరమాత్మునకు, నమః = నమస్కారము.

ఋషిభ్యోనమః, గురుభ్యోనమః. మాతృభ్యోనమః, పితృభ్యోనమః, ఆచార్యేభ్యోనమః, సర్వేభ్యో బ్రాహ్మణేభ్యోనమః.

కామోకార్షీన్మన్యురకార్షీ న్నమోనమః॥ పృథివ్యాపస్తేజోవాయురాకాశాత్. ఓం నమోభగవతే వాసుదేవాయ। యాంసదాసర్వభూతాని చరాణి స్థావరాణి చ॥ సాయంప్రాతర్న మస్యంతిసామాసంధ్యాఽభిరక్షతు॥ బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః। బ్రహ్మణ్యః పుండరీకాక్షో బ్రహ్మణ్యో విష్ణు రచ్యుతః॥ నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణ హితాయ చ। జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః॥

క్షీరేణ స్నాపితే దేవి చందనేన విలేపితే।
బిల్వపత్రార్చితే దేవి దుర్గాహం శరణం గతః॥
శ్రీదుర్గేఽహం శరణంగచ్ఛత్యోం నమోనమః॥

---

యాం = ఏ సంధ్యానామక పరమాత్మని, చరాచరాణిచ = చరాచర రూపులైన, సర్వభూతాని = సమస్తప్రాణులు, సాయంప్రాతః = సాయంకాల ప్రాతఃకాలములలో, నమస్యంతి = నమస్కారము చేయుదురో, సా సంధ్యా = ఆ సంధ్యా దేవత, తదభి మాని పరమాత్ముడు, మాం = నన్ను అభి = నాలుగు పార్శ్వములలోను, రక్షతు = కాపాడని.

దేవకీపుత్రః = దేవకియందు, అవతారముచేసిన పరమాత్ముడు, బ్రహ్మణ్యః = బ్రాహ్మణ ప్రియుడు, మధుసూదనః = మధునామక దైత్య సంహారకుడు, పుండరీకాక్షః కమలములవంటి కన్నులు గల పరమాత్ముడు, విష్ణుః = విష్ణువు, అచ్యుతః = నాశ రహితుడగు పరమాత్ముడు, బ్రహ్మణ్యదేవాయ = బ్రహ్మజ్ఞానులకు స్వామియైన, గోబ్రాహ్మణ హితాయచ = ఆవులకు, బ్రాహ్మణులకు హితమొనర్చు, జగత్ = ప్రపంచమునకు, హితాయ = హితము కలిగించు, కృష్ణాయ = కృష్ణునకు, గోవిందాయ = వేదవేద్యుడైన పరమాత్మునికి, నమోనమః = నమస్కారము; క్షీరేణ = పాలతో, స్నాపితే = స్నానము చేయించబడినట్టి, దేవి = క్రీడాది గుణసంపన్నురాలైన, చందనేన = గంధముతో, విలేపితే = పూయింపబడిన, దుర్గే = దుర్గాదేవీ, బిల్వపత్రార్చితే దేవి = బిల్వపత్రములచే పూజింపబడిన ఓ దేవీ; అహం = నేను (త్వాం = నిన్ను) శరణాగతః = శరణుపొందినాను.

(గా య త్ర్యు ద్వా స న మ్)

అస్యగాయత్రీ ఉద్వాసనమంత్రస్య వామదేవఋషిః, గాయత్రీ దేవతా, అనుష్టుప్ ఛందః, గాయత్ర్యు ద్వాసనేవినియోగః॥

ఉత్తమేశిఖరేజాతే భూమ్యాం పర్వతమూర్ధని ।
బ్రాహ్మణేభ్యోఽభ్యనుజ్ఞాతా గచ్ఛ దేవి యథాసుఖమ్ ॥

స్తుతా మయావరదావేదమాతా ప్రచోదయంతీపవనే ద్విజాతా । ఆయుఃపృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం మహ్యాం దత్వా ప్రజాతుం బ్రహ్మలోకమ్ ॥ ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరమ్ । సర్వదేవనమస్కారః కేశవంప్రతి గచ్ఛతి ॥ సర్వవేదేషుయత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫలం । తత్ఫలం సమవాప్నోతిస్తుత్వా దేవం

---

ఈ గాయత్రీ ఉద్వాసన మంత్రమునకు వామదేవ ఋషి గాయత్రీ దేవతా, అనుష్టుప్ ఛందస్సు, గాయత్రి ఉద్వాసనము చేయుచున్నాను.

దేవి = గాయత్రీదేవి గాయత్రీనామక పరమాత్మ!, భూమ్యాం = భూమియందు (ఉండెడి), పర్వతమూర్ధని = (మేరు) పర్వతముయొక్క శిరస్సునందు, జాతే = ఉండెడి, ఉత్తమే = శ్రేష్ఠమైన, శిఖరే = శిఖరమందు, (స్థాతుం = ఉండుటకొఱకు) బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులవలన, అభ్యనుజ్ఞాతా = అనుజ్ఞపొందినదానవై, యథా సుఖం = యదేచ్ఛముగ, గచ్ఛ = వెళ్లుము.

యథాసుఖముగా బోవు దేవతకు నమస్కారము. బ్రహ్మలోకం = వైకుంఠమును, ప్రజాతుం = నాకు పొందించుటకుగాను, మయా = నావలన, స్తుతా = స్తోత్రము చేయబడిన, వరదా = అభీష్టములను ఇచ్చునట్టి, పవనా ఇత్ = పరిశుద్ధమైనటువంటి, విజాతా = అనేక రూపములుగల, ప్రచోదయంతీ = నన్ను సత్కర్మములు జేయునట్లు ప్రేరించు, వేదమాతా = గాయత్రీ, పృథివ్యాం = భూమియందు మహ్యాం = నాకొఱకు, ఆయుః = ఆయుస్సును, ద్రవిణం = ధనమును, బ్రహ్మవర్చసం = బ్రహ్మతేజస్సును, దత్వా = ఇచ్చి, యథాసుఖం = యథేచ్ఛముగా, గచ్ఛ = వెళ్లుము.

ఆకాశాత్ = ఆకాశమునుండి, పతితం = పడిన, తోయం = నీళ్లు, సాగరం = సముద్రమును, యథా = ఏలాగున, గచ్ఛతి = పోయిచేరునో, తథా = అరీతి గానే, సర్వదేవ నమస్కారః = సమస్తదేవతలకు చేసిన నమస్కారము, కేశవంప్రతి = పరమాత్ముని గూర్చి, గచ్ఛతి = చేరుచున్నది.

జనార్దనమ్ । వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్ । సర్వ భూత నివాసోసి వాసుదేవ నమోస్తుతే॥

నమోఽ స్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే । సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీ యుగ ధారిణే నమః ॥ భద్రంనో అభివాదయే॥

శాంతిశ్శాంతిశ్శాంతిః । సర్వారిష్టశాంతిరస్తు ॥ ~~సమస్త మంగళావాప్తిరస్తు~~॥ చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యశ్శుభం భవతు ॥ ~~ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ త్ర్యార్షేయ ప్రవరాన్విత భారద్వాజగోత్రః ఆపస్తంబ సూత్రః యజుశ్శాఖాధ్యాయీ ఆనందతీర్థాయః శర్మా అహంభో అభివాదయే~~ ॥

---

సర్వవేదేషు = సర్వవేదములు చదువుటవల్ల, యత్పుణ్యం = రాబోవు ఏ పుణ్యమో, సర్వతీర్థేషు = సర్వతీర్థములందు స్నానము చేయుటవల్ల, యత్ఫలం = రాబోవు ఏ ఫలమో, దేవం = క్రీడాదిగుణ విశిష్టుడైన, జనార్దనం = దుష్టజన సంహారకుడైన పరమాత్మని, స్తుత్వా = స్తోత్రముచేసి, తత్ = ఆ, ఫలం = ఫలమును, (పురుషః = మనుష్యుడు,) సమవాప్నోతి = పొందుచున్నాడు.

వాసనాత్ = జగత్తు నీయందు వాసము చేయుటవలన వాసుదేవోసి = వాసుదేవ శబ్దుడవు. జగత్త్రయం = ఈ మూడు లోకములు, తే = నీవలన, వాసితం = వాసస్థానముగా చేయబడినవి; సర్వభూత నివాసోసి = సర్వప్రాణులకు అంతర్యామియు ఆశ్రయుడు అగుటవలన శ్రీ వాసుదేవ = లక్ష్మీసమేతుడైన వాసుదేవమూర్తీ, తే = నీకు, నమః = నమస్కారము; అనంతాయ = దేశతః కాలతః గుణతః అంతులేని, సహస్రమూర్తయే = అసంఖ్యాకమైన అవతార రూపములు గల, సహస్ర పాదాక్షి శిరోరుబాహవే = అసంఖ్యాకమైన పాదములు నేత్రములు, శిరస్సు, తొడలు, బాహువులు గల, సహస్రనామ్నే = అసంఖ్యాకమైన పేరులుగల, పురుషాయ = పురుష సూక్త ప్రతిపాద్యుడైన, శాశ్వతే = ఆదిమధ్యాంతరహితుడైన, సహస్రకోటి యుగ ధారిణే = సహస్రకోటి యుగములను ధరించిన, తే = నీకు, నమః = నమస్కారము. నః = మనకు, భద్రం = క్షేమమును, అభివాదయే = ప్రార్థించుచున్నాను.

శాంతిః శాంతిః శాంతిః = క్షేమము, సంపత్తు, సుఖము అవుగాక, సర్వారిష్ట శాంతిః = సమస్తమైన పాపములు నశించుగాక; సమస్త మంగళావాప్తిః = సమస్త మంగళములు పొందుట, అస్తు = కాని. చతుస్సాగరపర్యంతం = నాలుగుసముద్రముల

యస్యస్మృత్యా చనామోక్త్యా తపస్సంధ్యాక్రియాదిషు॥ న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతమ్॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన। యత్కృతం తు మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥ అనేన ప్రాతస్సంధ్యావందనేన భగవాన్ శ్రీమధ్వాచార్యాణాం హృత్కమల మధ్యనివాసః అనంతకల్యాణ గుణ పరిపూర్ణః క్షీరాబ్ధిశాయీ నిర్దోషజ్ఞానానందాత్మక భారతీ రమణ ముఖ్యప్రాణాంతర్గత సవితృనామక శ్రీ లక్ష్మీనారాయణః ప్రీయతాం ॥ ప్రీతో వరదోభవతు ॥ శ్రీ కృష్ణార్పణమస్తు ॥

కేశవాయస్వాహా.........హరయేనమః, శ్రీకృష్ణాయనమః ॥

[అచ్యుతాయనమః, అనంతాయనమః, గోవిందాయనమః అని నామత్రయము జపించవలెను.]

---

పర్యంతమునున్న, గో బ్రాహ్మణేభ్యః = గోవులకు బ్రాహ్మణులకు, శుభం భవతు = క్షేమము గలుగుగాక ....గోత్రము, ప్రవరము, శాఖా, శర్మయగు నేను నమస్కారము చేసెదను.

తపః = తపస్సు, సంధ్యా = సంధ్యావందన, క్రియాదిషు = కర్మలలో, యస్య = యే పరమాత్మని, స్మృత్యా = స్మరణవలనను, నామోక్త్యాచ = నామోచ్చారణము వలనను, న్యూనం = లోపమైనది, సంపూర్ణతాం = పూర్ణత్వమును, యాతి = చెందునో, సద్యః = ఇప్పుడు, తం = ఆ, అచ్యుతం = నాశరహితుడైన పరమాత్మని, వందే = నమస్కరించుచున్నాను; రమాపతే = లక్ష్మీపతియైన పరమాత్ముడా, మంత్రహీనం = మంత్రహీనముగాను, క్రియాహీనం = కర్మహీనముగాను, భక్తిహీనం = భక్తిరహితముగాను, మయా = నాచేత, యత్కృతం = ఏదేది చేయబడినదో, తత్ = అది, మే = నాకు, పరిపూర్ణం = సంపూర్ణ ఫలప్రాప్తికి కారణము, అస్తు = అగుగాక,

అనేన = ఈ, ప్రాతః సంధ్యావందనేన = ప్రాతస్సంధ్యాకర్మమువల్ల, భగవాన్ = షడ్గుణైశ్వర్యసంపన్నుడైన, శ్రీ మధ్వాచార్యాణాం = శ్రీమధ్వాచార్యుల, హృత్కమలమధ్యనివాసీ = హృదయ కమలమధ్యమందు నివసించు, అనంతకల్యాణ గుణ పరిపూర్ణః = అనేక కల్యాణగుణములతో పూర్ణుడైన, క్షీరాబ్ధిశాయీ = క్షీరసముద్రములో శయనించు, నిర్దోష జ్ఞానానందాత్మకః = దోషలేశములేని జ్ఞానానంద స్వరూపుడైన, భారతీరమణ ముఖ్య ప్రాణాంతర్గత శ్రీలక్ష్మీనారాయణః = భారతీపతి

కాయేనవాచామనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనావాఽనుసృతఃస్వభావః।
కరోమియద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి॥

యదక్షరపదభ్రష్టం మాత్రా హీనంచ యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తుతే ॥
ఋగ్వేదీయ ఆశ్వలాయన ప్రాతః సంధ్యావందనం సంపూర్ణమ్,
శ్రీ కృష్ణార్పణమస్తు.

---

## మాధ్యాహ్నిక సంధ్యావందనమ్.

[మాధ్యాహ్నిక సంధ్యావందనమునకు ౧౧ ఘంటలనుండి ౧౨ ఘంటలవరకు ఉత్తమకాలము. ప్రాతః సంధ్యావందనము కాని యెడల దానిని మాధ్యాహ్నికమునకు పూర్వముగాను, సాయంకాలము వరకు మాధ్యాహ్నికము కానియెడల దానిని సాయం సంధ్యావందనము తరువాత చేయదగినది.]

ఓం కేశవాయస్వాహా........హరయేనమః. శ్రీకృష్ణాయనమః॥ ప్రణవస్య పరబ్రహ్మఋషిః........పూర్వోక్త ఏవంగుణ........భారతీ రమణ ముఖ్య ప్రాణాంతర్గత........మాధ్యాహ్నిక సంధ్యా ముపాసిష్యే.

---

ముఖ్యప్రాణాంతర్గత శ్రీలక్ష్మీనారాయణుడు, ప్రీయతాం = ప్రీతుడగుగాక : ప్రీతః = ప్రీతుడై, వరదోభవతు = వరముల నిచ్చుగాక.

కాయేన = దేహములో, వాచా = వాక్కుతో, మనసా = మనస్సుతో ఇంద్రియైః = ఇంద్రియములతో, బుద్ధ్యా = బుద్ధితో, ఆత్మనావా = ప్రాణములోను, స్వభావం = స్వభావమును, అనుసృతః = అనుసరించినవాడై, యద్యత్ కరోమి = ఏమేమి చేయుదునో, సకలం దానినన్నిటిని పరస్మై = ఉత్తముడైన, నారాయణాయ = నారాయణునికి, అహం = నేను, సమర్పయామి = అర్పణచేయుచున్నాను.

ఆపోహిష్ఠేతి........ఆపోజనయథాచనః ॥ [1] ఆపః పునంత్విత్యస్య, పూత ఋషిః ఆపోదేవతా, అష్టిఛందః. అపాంప్రాశనే వినియోగః.

[2] ఓం ఆపః పునంతు పృథివీం పృథివీపూతా పునాతు మామ్॥ పునంతు బ్రహ్మణస్పతిర్బ్రహ్మపూతా పునాతు మాం॥ యదుచ్ఛిష్ట మభోజ్యం యద్వాదుశ్చరితం మమ। సర్వం పునంతుమా మాపోఽ సతాంచప్రతిగ్రహం స్వాహా॥. కేశవాయస్వాహా .... శ్రీకృష్ణాయనమః ఆపోహిష్ఠేతినవర్చస్య .... దివంచ పృథివీంచాంతరిక్ష మథోస్వః॥. కేశవాయస్వాహా.... శ్రీకృష్ణాయనమః.

---

1. 'ఆపః పునంతు' అను మంత్రమునకు పూతనామక ఋషి ఆపోదేవత అష్టిఛందస్సు అని అభిమంత్రించిన ఉదకమును ప్రాశనము చేయవలెను.

(ఉదకపరము) ఆపః = ఉదకము, పృథివీం = భూమిని, పునంతు = శుద్ధముగా జేయుగాక. (ఈ ఉదకము) బ్రహ్మణస్పతిః = వేదపాలకుడైన ఆచార్యుని, పునంతు = పరిశుద్ధిని జేయుగాక. మమ = నాకు, యత్ = ఏ, ఉచ్ఛిష్టమును, అభోజ్యం = అభక్ష్యమును (కలదో) యద్వా = వేరేదైన, దుశ్చరితం = దుష్కార్యయును (కలదో) సర్వం = వానినన్నిటిని, (పోగొట్టి) మాం = నన్ను, పునంతు = శుద్ధునిగాజేయుగాక. అసతాం = అసత్పురుషులయొక్క, ప్రతి గ్రహం = ప్రతి గ్రహమును. (పోగొట్టినన్ను శుద్ధునిజేయుగాక) (అందులకుగాను ఈ జలము) స్వాహా = హోమముచేయబడినది (అగుగాక.) (తై. ఆ. ౧౦-౨౩)

(పరమాత్మపరము) ఆపః = ఉదకాంతర్గత పరమాత్ముడు, పృథివీం = భూదేవతను, పునంతు = శుద్ధముగా జేయుగాక. పూతా = పరిశుద్ధురాలయిన, పృథివీ = పృథివీ శబ్దవాచ్యుడగు పరమాత్మ, మాం = లక్ష్మీదేవిని, పునాతు పరిశుద్ధురాలను జేయుగాక. బ్రహ్మణస్పతిః = వేదపాలకుడగు చతుర్ముఖబ్రహ్మను; పునంతు = పరిశుద్ధునిగా జేయుగాక. బ్రహ్మ = బ్రాహ్మణశ్రేష్ఠుడగు బ్రహ్మ, పూతా = పరిశుద్ధుడై, మాం = నన్ను, పునాతు = పరిశుద్ధునిగా జేయుగాక. మమ = నాకు, యత్ = ఏ, ఉచ్ఛిష్టం = ఉచ్ఛిష్టము, అభోజ్యం = అభక్ష్యము (కలదో) యద్వా = వేరేదైన దుశ్చరితం = దుష్కార్యము (కలదో) సర్వం = వానినన్నిటిని (పోగొట్టి) అసతాం = అసత్పురుషుల యొక్క, ప్రతిగ్రహంచ = ప్రతిగ్రహముచే కలిగిన పాపమును (పోగొట్టి) స్వాహా = అగ్న్యంతర్గతుడగు పరశురామదేవుడు, మాం = నన్ను, పునంతు = రక్షించుగాక.

ప్రణవస్య పరబ్రహ్మఋషిః .... భూర్భువస్సువరోం ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ భారతీరమణ ....... .... శ్రీలక్ష్మీ నారాయణ ప్రీత్యర్థం మాధ్యాహ్నిక సంధ్యార్ఘ్య ప్రదానం కరిష్యే. హంసశ్శుచిషదిత్యస్య మంత్రస్య, గౌతమపుత్రో వామదేవఋషిః, సూర్యో దేవతా, త్రిష్టుప్ఛందః. మాధ్యాహ్నికార్ఘ్య ప్రదానే వినియోగః॥.

ఓం హంసశ్శుచిషద్వసురన్తరిక్షసద్ధోతావేదిషదతిథిర్దురోణసత్ ।
నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జాగోజాఋతజా అద్రిజా ఋతం బృహత్॥

(అనిఅర్ఘ్యమునీయవలెను॥) ఆకృష్ణేన ఇత్యస్యమంత్రస్య హిరణ్యస్తూప ఋషిః, సవితాదేవతా, త్రిష్టుప్ఛందః, మాధ్యాహ్నికార్ఘ్య ప్రదానే వినియోగః.

ఓం ఆకృష్ణేన రజసావర్తమానో నివేశయన్నమృతం మర్త్యంచ।
హిరణ్యయేన సవితా రథేనాదేవోయాతి భువనా విపశ్యన్॥

---

'హంసశ్శుచిషత్' అను మంత్రమునకు గౌతమ పుత్రుడైన వామదేవఋషి, సూర్యుడు దేవత, జగతీ ఛందసు, మాధ్యాహ్నిక అర్ఘ్యము నిచ్చుటకు ఉపయుక్తము అగుచును.

హంసః = దోషహీనుడు సారరూపుడు, శుచిషత్ = వాయుదేవుని యందుండు వాడు, వసుః = పూర్ణసుఖుడు, అంతరిక్షసత్ = అంతరిక్షములోనుండువాడు. హోతా = ఇంద్రియములందుండి శబ్దాదులను అనుభవించువాడును. వేదిషత్ = యజ్ఞవేదికయందు పూజ్యుడైనవాడు. అతిథిః = అతిశయమైన అన్నముగలవాడు, దురోణషత్ = సోమరస పాత్రలో నుండువాడు, నృషత్ = మనుష్యులలో నుండువాడు, వరసత్ = ఉత్తములైన బ్రహ్మాదులయందుండువాడు, అబ్జాః = ఉదకములో పుట్టినవస్తువులలో నుండువాడు, గోజాః = భూమియందు పుట్టిన సస్యాదులలోనుండువాడు, ఋతజాః = ముక్తజీవులలో నుండువాడు, అద్రిజాః = పర్వతములలో పుట్టిన పదార్థములలో నుండువాడు, ఋతం = వేద ప్రతిపాద్యుడు, బృహత్ = పూర్ణగుణములు గలిగినవాడు.

'ఆకృష్ణేన' అను మంత్రమునకు హిరణ్యస్తూప ఋషి, సవితాదేవత త్రిష్టుప్ ఛందస్సు. మాధ్యాహ్నిక అర్ఘ్య ప్రదానమునందు వినియోగము.

(సూర్యపరము) సవితా = సూర్యుడు, కృష్ణేన = నల్లనైన, రజసా = లోకము చేత, (సూర్యోదయమునకు అంధకారావృతమయిన అంతరిక్షమార్గమునందు) ఆవర్తమానః = చుట్టుచుండువాడైన, అమృతం = దేవతలను, మర్త్యంచ = మనుష్యులను

(అని అర్ఘ్యము నీయవలెను)

ఓం ప్రణవస్య పరబ్రహ్మఋషిః । పరమాత్మా దేవతా । దైవీ గాయత్రీ ఛందః । వ్యాహృతీనాం ప్రజాపతిఋషిః । అగ్నివాయు సూర్యా దేవతాః । గాయత్ర్యుష్ణిగనుష్టుభః ఛందాంసి । గాయత్ర్యా విశ్వామిత్రఋషిః । సవితా దేవతా । గాయత్రీ ఛందః । మాధ్యాహ్నికార్ఘ్య ప్రదానే వినియోగః ॥

ఓం భూర్భువః స్వః । తత్సవితుర్వరేణ్యం । భర్గో దేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ ॥

(అని అర్ఘ్యము నీయవలెను)

ఉతాయాతేత్యస్య భౌమోఽత్రిఋషిః । అశ్వినౌ దేవతా । త్రిష్టుప్ ఛందః । మాధ్యాహ్నిక కాలాతిక్రమ దోషప్రాయశ్చిత్తార్థం అర్ఘ్య ప్రదానం కరిష్యే ॥

ఓం ఉతాయాత సంగవే ప్రాతరహ్నో మధ్యందినా । ఉదితా సూర్యస్య దివానక్త మవసా శంతమేన అధానీం ప్రతిస్వి నాక్తతాన ॥

---

నివేశయన్ = తమతమ స్థానములందు నిలుపువాడై, భువనాని = లోకములను, పశ్యన్ = చూచుచుండువాడై, హిరణ్యయేన రథేన = బంగారు రథముతో, ఆయాతి = వచ్చుచున్నాడు. (ఋ. ౧.౩౫-౨)

(పరమార్థపరము) సవితా = సవితృశబ్దవాచ్యుడైన నారాయణుడు, కృష్ణేన = పాపముతో, రజసా = అంతఃకరణముతో, ఆవర్తమానః = ఉండునట్టి, మర్త్యం = మరణశీలురైన మనుష్యులను, అమృతం = మోక్షమును, చ = చక్కగా, నివేశయన్ = పొందించువాడై, భువనాని = సర్వలోకములను, పశ్యన్ = చూచుచు, హిరణ్యయేన రథేన = బంగారు రథమున, ఆయాతి = వచ్చుచున్నాడు.

'ఉతాయాతా' అను మంత్రమునకు భౌమోఽత్రి ఋషి, అశ్వని దేవతలు, త్రిష్టుప్ ఛందస్సు, కాలాతీతమైనదానికిగాను ప్రాయశ్చిత్తార్ఘ్యము ఇచ్చుచున్నాను.

(అని అర్ఘ్యము నీయవలెను)

ఏహిత్వం దేవి శీఘ్రం వై గాయత్రీ బ్రహ్మరూపిణీ ।
జపానుష్ఠాన సిద్ధ్యర్థం ప్రవిశ్య హృదయం మమ ॥

అసావాదిత్యో బ్రహ్మ.

(అని కూర్చొని ఆచమనము చేయవలెను)

[ఆచమనానంతరం ద్వాదశాదిత్యాన్ తర్పయేత్]

| | | | |
|---|---|---|---|
| ఓం ధాతారం | తర్పయామి | ఓం ఇంద్రం | తర్పయామి |
| ,, అర్యమణం | ,, | ,, వివస్వతం | ,, |
| ,, మిత్రం | ,, | ,, పూషణం | ,, |
| ,, వరుణం | ,, | ,, త్వష్టారం | ,, |
| ,, అంశుం | ,, | ,, పర్జన్యం | ,, |
| ,, భగం | ,, | ,, విష్ణుం | ,, |

[ఈ తర్పణము ఏకాదశీనాడు చేయకూడదు. శుద్ధ ఏకాదశీనాడు కేశవాది 12 నామములతోను, కృష్ణఏకాదశీనాడు సంకర్షణాది 12 నామములతోను చేయవలెను.]

(ఈమంత్రములను నిలచికొని చెప్పవలెను)

( సూర్యోపస్థానమ్ )

ఉదుత్యంజాతవేదసమితి త్రయోదశర్చస్య సూక్తస్య కణ్వపుత్రః ప్రస్కణ్వఋషిః, సూర్యోదేవతా, నవాద్యాగాయత్ర్యః, ఉద్వయం తమసస్పరీతి చతస్రోఽనుష్టుభః, ఉద్యన్నద్యేతిత్రయంత్రిచోరోఘ్నః,

---

'ఉదుత్యం జాతవేదసం' అని ప్రారంభమగు 13 ఋక్ మంత్రములకు కణ్వ పుత్రుడైన ప్రస్కణ్వ అనువాక ఋషి. సూర్యుడు దేవత మొదటి 9 ఋక్కులు గాయత్రీ ఛందస్సు. ఇక నాలుగు అనుష్టుప్ ఛందస్సు. 'ఉద్యన్నద్య' నుండి మూడు ఋక్ మంత్రములు రోగనాశకములు, నాలుగవది శత్రునాశకము; 'చిత్రం దేవానాం' అని

ఉపనిషదంత్యాత్ అర్ధర్చశోద్విషం నాశనీ, చిత్రం దేవనామదగాద నీకమితి షడర్చస్యసూక్తస్య, ఆంగిరసపుత్రః కుత్సఋషిః సూర్యోదేవతా త్రిష్టుప్ఛందః, సూర్యోపస్థానే వినియోగః.

ఓం ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః, ।
దృశే విశ్వాయసూర్యం ॥౧॥

అపత్యే తాయవో యథా నక్షత్రాయంత్యక్తుభిః ।
సూరాయ విశ్వచక్షసే ॥౨॥

అదృశ్రమస్య కేతవో విరశ్మయో జనాం అను ।
భ్రాజంతో అగ్నయో యథా ॥౩॥

తరణిర్విశ్వదర్శతో జ్యోతిష్కృదసి సూర్య ।
విశ్వమాభాసిరోచనమ్ ॥౪॥

---

ప్రారంభమగు మొదటి ఆరు ఋక్కులకు ఆంగిరసపుత్రుడైన కుత్స అనువాడు ఋషి, సూర్యుడు దేవత, త్రిష్టుప్ ఛందస్సు, ఋఙ్మంత్రములతో పరమాత్మని ధ్యానము చేయుచున్నాను.

(1) (సూర్యపరము) కేతవః = కిరణములు, త్యం = సిద్ధుడైన, జాతవేదసం = సర్వజ్ఞుడైన, సూర్యందేవం = సూర్యదేవుని, విశ్వాయ = సకల ప్రపంచముకొఱకు దృశే = చూచుటకొరకు (సకల ప్రాణులు చూచుటకొరకు) ఉద్వహంతి = ఊర్ధ్వముగా వహించుచున్నవి. (ఋ. ౧.౫౦-౧)

(పరమాత్మపరము) కేతవః = జ్ఞానులు, ఉత్ = ఉత్కృష్టుడైన, త్యం = అన్నిచోటలను వ్యాప్తుడైన, జాతవేదసం = సర్వజ్ఞుడైన, దేవం = క్రీడాదిగుణములతో గూడిన, సూర్యం = సూర్యశబ్దవాచ్యుడైన పరమాత్ముని, విశ్వాయ = అందరికిని, దృశే = మోక్షసాధన జ్ఞానముకొఱకు, ఉద్వహంతి = ఉత్కృష్టముగా ఉపదేశము చేయుచున్నారు,

2, (సూర్యపరము) త్యే = ప్రసిద్ధులైన; తాయవః యథా = దొంగలవలె; నక్షత్రాః = నక్షత్రములు; అక్తుభిః = రాత్రితోగూడ; విశ్వచక్షసే = సర్వప్రపంచమును ప్రకాశింపజేయు; సూరాయ = సూర్యునికొరకు: (సూర్యుని ఆగమనముచూచి) అపయంతి = పరుగెత్తుచున్నవి.

ప్రత్యఙ్ దేవానాంవిశః ప్రత్యఙ్ ఉదేషి మానుషాన్ ।
ప్రత్యఙ్ విశ్వం స్వర్దృశే ॥౫॥
యేనాపావక చక్షసా భురణ్యం తంజనాం అను ।
త్వం వరుణ పశ్యసి ॥౬॥

---

(2) (పరమాత్మపరము) యథా = ఏరీతిగా; నక్షత్రాః = పుత్రరహితులైనవారు; అపత్యే = పుత్రార్థము యజ్ఞములచేత పరమాత్మని సేవించెదరో; తథా = అట్లే; నక్షత్రాః = రక్షకరహితులైన; తే = ప్రసిద్ధులయిన: అయవః = జ్ఞానులు అక్తుభిః = మోక్షమునపేక్షించువారై; సూరాయ = ప్రకాశరూపుడైన; విశ్వచక్షసే = పరమాత్మనిని; (యజ్ఞాదిసాధనములచేత) యంతి = పొందుచున్నారు. (ఋ. ౧-౫౦-౨)

(సూర్యపరము) భ్రాజంతః = ప్రకాశించు; అగ్నయఃయథా = అగ్నులవలె; అస్య = ఈ సూర్యునకు; (సూర్యాగమనమునకు) కేతవః = జ్ఞాపకములైన; రశ్మయః = కిరణములు; జనాం = సమస్తప్రాణులను; అను = క్రమముగా; వ్యదృశ్రం = చూపించును.

3. (పరమాత్మపరము) విరశ్మయః = విశిష్టజ్ఞానీహీనులు; కేతవః = జ్ఞానుల యందు; అగ్నయః = ఆహవనీయాద్యగ్నులయందు; యథా = ఎట్లో; తథా = అట్లు; భ్రాజంతః = దేదీప్యమానులగు; జనాం = భగవదుపాసకజనులను; అదృశ్రం = అగోచరమగు; అస్య = ఈ పరమాత్మయొక్క (రూపమును) అను = తమ తమ యోగ్యతానుసారముగ; యంతి = పొందుదురు. (ఋ. ౧-౫౦-౩)

4. (సూర్యపరము) సూర్య = ఓసూర్యుడా!; (నీవు) తరణిః = తారకుడుగాను విశ్వదర్శతః = సమస్తప్రాణులచే చూడబడువాడుగాను; జ్యోతిష్కృత్ = ప్రకాశ మును గలిగించువాడుగాను; అసి = ఉన్నావు; (రాత్రులయందు చంద్రబింబమునందు నీ కిరణములను ప్రతిఫలింపజేసి తద్ద్వారా అంధకారమును పోగొట్టువాడవు) విశ్వం = ప్రపంచమును; రోచనం = ఆకాశమును; ఆభాసి = ప్రకాశింపజేయుచున్నావు.

4. (పరమాత్మపరము) సూర్య = సూర్యప్రేరకుడగు ఓ పరమాత్మ; (నీవు) తరణిః = సంసార సముద్రమును దాటించువాడు; విశ్వదర్శతః = సమస్తముక్తియోగ్యు లకు సాక్షాత్కరించినవాడు; జ్యోతిష్కృత్ = సూర్యచంద్రాదులకు సృష్టికర్త; విశ్వం = సమస్త ప్రపంచమును; రోచనం = ప్రకాశముచేత; ఆభాసి = చక్కగా ప్రకాశింప చేయుదువు. (ఋ. ౧-౫౦-౪)

5. (సూర్యపరము) (ఓ సూర్యుడా! నీవు) దేవానాం = దేవతలలో; విశః = వైశ్యులను మరుత్తులనబడు దేవతలను గురించి; ప్రత్యఙ్ = అభిముఖముగా; ఉదేషి = ఉదయించుచున్నావు; మానుషాన్ = మనుష్యులను గురించి; ప్రత్యఙ్ = అభిముఖ

విద్యామేషి రజస్పృథ్వ హామిమానో అక్తుభిః ।
పశ్యన్ జన్మానిసూర్య ॥౭॥

సప్తత్వా హరితోరథే వహంతి దేవసూర్య ।
శోచిష్కేశం విచక్షణ ॥౮॥

---

ముగాః (ఉదయించుచున్నావు) విశ్వం = వ్యాప్తమయిన; స్వః = స్వర్గలోకమును: ధృశే = చూచుటకొరకు; ప్రత్యఙ్ = అభిముఖముగాను (ఉదయించుచున్నావు.)

౫. (పరమాత్మపరము) సూర్య = జ్ఞానప్రాప్యుడగు ఓ పరమాత్మ: (నీవు) దేవానాం విశః = దేవతలయందుండువాడవు; ప్రత్యఙ్ = భిన్నత్వముచేత; విశః = బ్రహ్మాదుల హృదయమందు: ఉదేషి = అపరోక్షముగ నుండువాడవు; మానుషాన్ ప్రతి = జ్ఞానులనుగూర్చి: ఉదేషి = ఉత్పన్నుడగువాడు. విశ్వంప్రతి = సమస్త ప్రపంచమును గూర్చి; ఉదేషి = వ్యక్తుడగుదువు; స్వః = స్వతంత్రుడైయున్నావు.
(ఋ. ౧-౫౦-౫)

6. (సూర్యపరము) పావక = శుద్ధికరుడును; వరుణ = అనిష్టనివారకుడును నగు ఓ సూర్యదేవుడా!; జనాఞ = ప్రాణులను; భురణ్యంతం = ధరించుచుండెడిలోకమును; యేనచక్షసా = ఏ ప్రకాశముచేత; త్వం = నీవు; అనుపశ్యసి = చూచుచున్నావో; (ఆప్రకాశమును స్తుతించెదము.)

6. (పరమాత్మపరము) పావక = ఓ జగత్పవిత్రుడా!; వరుణ = ఓ ఉత్కృష్ట సుఖభోగీ; త్వం = నీవు; భురణి = విశేషముగా; అంతం = నాశము (చెందు) జనాఞ = జనులను; అను = చక్కగా; చక్షసా = అనుగ్రహముచే; పశ్యసి = చూచుచున్నావు.
(ఋ. ౧-౫౦-౬)

7. (సూర్యపరము) సూర్య = ఓ సూర్యుడా: త్వం = నీవు: పృథు = విస్తీర్ణమయిన; ద్యాం = అంతరిక్షమనెడి; రజః = లోకమును గురించి: అహా = దినములను; అక్తుభిః = రాత్రులతోగూడ: మిమానః = ఏర్పరచువాడై; జన్మాని = ప్రాణులను; పశ్యఞ = చూచుచుండువాడై: వ్యేషి = పోవుచున్నావు.

7. (పరమాత్మపరము) సూర్య = ఓ పరమాత్మా!; రజః = జ్ఞానాజ్ఞానముల వలన ఉత్పన్నమైన రజోగుణముచేత; పృథు = విస్తీర్ణమయిన; జన్మాని = జన్మములు గలిగిన జనులను; పశ్యఞ = చూచుచుండువాడై: అహా = జ్ఞానమును; అక్తుభిః = తమోజ్ఞానమువలన; మిమానః = ఉత్పత్తిచేసి; విద్యాం = అపరోక్షజ్ఞానమును; ఏషి = ఇచ్చుచున్నావు.
(ఋ. ౧-౫౦-౭)

8. (సూర్యపరము) దేవ = ప్రకాశించుచుండెడివాడును; విచక్షణ = ప్రకాశకు

అయుక్త సప్త శుంధ్యువః సూరో రథస్య నప్త్యః ।
తాభిర్యాతి స్వయుక్తిభిః ॥౯॥
ఉద్వయంతమసస్పరి జ్యోతిష్పశ్యంత ఉత్తరం ।
దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తరమ్ ॥౧౦॥

---

డునుసైన; సూర్య = సూర్యుడా!; శోచిష్కేశం = కిరణములే కేశములుగాగల; రథే = రథమునందు (వహించుచున్న) త్వాం = నిన్ను; సప్తహరితః = ఏడు అశ్వములు; వహంతి = వహించుచున్నవి.

8. (పరమాత్మపరము) సూర్య = ఓ జ్ఞానిగమ్యుడా!; దేవ = క్రీడాదిగుణ విశిష్టా!; విచక్షణ = సర్వకార్యములందు కుశలుడగు ఓ పరమాత్మా!; త్వా రథే = నీరథమునందు; కేశం = బ్రహ్మరుద్రులను; శోచిః = ధరించెదవు; (లేక) శోచిష్కేశం = నీ భక్తులనెడి దేహమునందు; సప్త = మనోబుద్ధులతో గూడిన ఏడింద్రియములను; వహంతె = వహించెదవు. (ఋ. ౧-౫౦-౮)

9. (సూర్యపరము) సూరః = సూర్యుడు; రథస్య = రథమునకు; నప్త్యః = ధారకములైన; సప్తశుంధ్యువః = ఏడుఅడుగు గుఱ్ఱములను; అయుక్త = (రథము నందు) కట్టియున్నాడు; స్వయుక్తిభిః = తనచేత కట్టబడిన; తాభిః = ఆ గుఱ్ఱముల చేత: యాతి = పోవుచున్నాడు.

9. (పరమాత్మపరము) సూరః = సర్వప్రేరకుడైన పరమాత్ముడు; శుంధ్యవః = శోధకశక్తిగల; నప్త్యః = పతనరహితములైన; సప్త = ఏడు జ్ఞానేంద్రియములతో; అయుక్త = చేర్చినాడు. (ఈశ్వరుడు జనులకు సప్తేంద్రియములద్వారా సుజ్ఞానమును పొందునట్టి శక్తినిచ్చినాడు.) స్వయుక్తిభిః = తనచేత చేర్పబడిన; తాభిః = ఆసప్తేంద్రియములతోగూడి; (అంతర్యామియై) యాతి = సంచరించుచున్నాడు. (ఋ. ౧-౫౦-౯)

10. (సూర్యపరము) వయం = మేము; తమసః = అంధకారమునకంటె; పరి = పైభాగమునసుండెడి; జ్యోతిః = తేజోరూపమైన; ఉత్తరం = శ్రేష్ఠమైన: దేవత్రా = దేవతలందు; దేవం = ప్రకాశశీలుడైన; సూర్యం = సూర్యునిని; ఉత్పశ్యంతః = చూచుచుండువారమై; ఉత్తమం = శ్రేష్ఠమయిన; జ్యోతిః = సూర్యరూపమును అగన్మ = పొందెదము.

10. (పరమాత్మపరము) తమసఃపరి = అజ్ఞాననాశమైన పిదప; వయం = మేము; ఉత్తరం = శ్రేష్ఠమయిన; జ్యోతిః = ప్రకాశరూపమైన అపరోక్షజ్ఞానమును; పశ్యంతః = పొందినవారై, దేవత్రా = దేవతలలో; ఉత్తమం = ఉత్కృష్టుడైన; దేవం = క్రీడాదిగుణవిశిష్టుడైన; సూర్యం = జ్ఞానిప్రాప్యుడైన; జ్యోతిః = ప్రకాశించు పరమాత్మను; అగన్మ = పొందెదము. (ఋ. ౧.౫౦-౧౦)

ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాందివం ।
హృద్రోగం మమసూర్య హరిమాణంచ నాశయ ॥౧౧॥
శుకేషు మే హరిమాణం రోపణాకాసు దధ్మసి ।
అథో హారిద్రవేషు మే హరిమాణం నిదధ్మసి ॥౧౨॥
ఉదగాదయ మాదిత్యో విశ్వేన సహసాసహ ।
ద్విషంతం మహ్యం రంధయన్మో అహం ద్విషతేరథం ॥౧౩॥

---

11. (సూర్యపరము) మిత్రమహః = అనుకూలమైన తేజస్సుగల; సూర్య = ఓ సూర్యుడా! అద్య = ఈ దినమునందు; ఉద్యన్ = ఉదయమును పొందుచు; ఉత్తరాం = ఊర్ధ్వభాగమునందుండు, దివం = అంతరిక్షమును; ఆరోహన్ = ఎక్కుచుండువాడవై; మమ = నాయొక్క; హృద్రోగం = హృదయరోగమును; హరిమాణంచ = బాహ్యరోగముచేనైన పచ్చనివర్ణమును; నాశయ = పోగొట్టుము.

11. (పరమాత్మపరము) సూర్య = సర్వమును ప్రేరణచేయు; మిత్రమహ = మిత్రశ్రేష్ఠుడా! అద్య = ఇప్పుడు; ఉద్యన్ = ఆవిర్భవించిన; ఉత్తరాం = ఉత్కృష్టమైన; దివం = జ్ఞానమును; ఆరోహన్ = పొందుటకై; మమ = నాయొక్క; హరిమాణం = జ్ఞాననాశక సామర్థ్యముగల; హృద్రోగం = అంతర్వ్యాధిని; (అరిషడ్వర్గమనెడి యుపద్రవమును) నాశయ = పోగొట్టుము. (ఋ. ౧-౫౦-౧౧)

12. (సూర్యపరము) మే = నాయొక్క; హరిమాణం = పచ్చనివర్ణమును; శుకేషు = చిలుకలయందును; రోపణాకాసు = గోరువంకలయందును; నిదధ్మసి = ఉంచుము; అథో = పిమ్మట; మే = నాయొక్క; హరిమాణం = పచ్చనివర్ణమును; హారిద్రవేషు = హరిదళపుచెట్టునందు; నిదధ్మసి = ఉంచుము.

12. (పరమాత్మపరము) శుకేషు = శోకయుక్తుడైన; మే = నాయొక్క; (మిథ్యాత్వారోపణమునందు) రోపణాకాసు = మిథ్యాజ్ఞానులయందును; హరిమాణం = హరిసర్వోత్తమత్వ ప్రతిపాదక వేదాదిశాస్త్రమును; (నాయందు) నిదధ్మసి = ప్రతిపాదించి అథో = పిమ్మట; హారిద్రవేషు = జ్ఞానులయందు; హరిమాణం = హరిసర్వోత్తమత్వమును; నిదధ్మసి = ఎక్కువగా ప్రతిపాదించెదను. (ఋ. ౧-౫౦-౧౨)

13. (సూర్యపరము) అయం = ఈ; ఆదిత్యః = సూర్యుడు; విశ్వేన = సమస్తమయిన; సహసాసహ = బలముతోకూడ; మహ్యం = నన్ను గురించి, ద్విషంతం = ద్వేషముచేయుచుండువారిని; రంధయన్ = హింసచేయువాడై; ఉదగాత్ = ఉదయించెను; అహం = నేను; ద్విషతే = శత్రువుకొరకు; మోరథం = హింసచేయను.

చిత్రం దేవానా ముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః।
ఆప్రాద్యావా పృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ ॥౧॥

సూర్యోదేవీముషసం రోచమానాం మర్యోనయో షామభ్యేతి పశ్చాత్।
యత్రానరో దేవయంతో యుగాని వితన్వతే ప్రతిభద్రాయ భద్రమ్ ॥౨॥

---

13. (పరమాత్మపరము) అయం = ఈ; ఆదిత్యః = అదితియందవతరించిన; వామననామక పరమాత్ముడు; విశ్వేన = పూర్ణమైన; సహసాసహ = బలశక్తిమంతుడైన వాయుదేవతతోగూడి; రక్షం = రక్షస్థుడై; మహ్యం = తనను; ద్విషంతం = ద్వేషించు వారిని; రంధయన్ = హింసచేయువాడై; ఉదగాత్ = ప్రకాశించెను; అహం = పరమాత్ముడు; ద్విషతః = ద్వేషించువారివలన; రథం = హింసను; మో = పొందడు.
(ఋ. ౧-౫౦-౧౩)

1. (సూర్యపరము) చిత్రం = ఆశ్చర్యకరమగు; మిత్రస్య = సూర్యునకు; వరుణస్య = వరుణునకు; అగ్నేః = అగ్నికి; చక్షుః = నేత్రస్థానీయమైన; దేవానాం = ప్రకాశించుచుండెడి కిరణములయొక్క; అనీకం = సమూహము; ఉదగాత్ = ఉదయించెను; ద్యావా పృథివీ = స్వర్గమును భూమిని; అంతరిక్షం = అంతరిక్షమును; ఆప్రాః = వ్యాపించెను; సూర్యః = సూర్యుడు; జగతః = జంగమములకును; తస్థుషశ్చ = స్థావరములకును; ఆత్మా = అంతర్యామి అయినవాడు. (ఋ.౧-౧౧౫-౧)

(పరమాత్మపరము) సూర్య = జ్ఞానిప్రాప్యుడైన పరమాత్మా!; చిత్రం = నానావిధమైన; దేవానాం = బ్రహ్మాదిదేవతల; అనీకం = సమూహమునకు; మిత్రస్య = సూర్యునకు; వరుణస్య = వరుణునకు; అగ్నేః = అగ్నికి; చక్షుః = జ్ఞానప్రదుడు; ఆప్రాః = నీతేజస్సుచేత; ద్యావాపృథివీ అంతరిక్షం = భూస్వర్గాంతరిక్ష లోకములకు; జగతః = చేతనులకు; తస్థుషశ్చ = స్థావరములకును; ఆత్మా = అంతర్యామియై; (స్వామియై) ఉదగాత్ = శ్రేష్ఠత్వమును పొందితివి.

2. (సూర్యపరము) సూర్యః = సూర్యుడు; దేవీం = దానాదిగుణయుక్తమయిన; రోచమానాం = ప్రకాశించుచుండెడి; ఉషసం = ఉషఃకాలమును; పశ్చాత్ = పశ్చాద్భాగమునందు; మర్యః = మనుష్యుడు; యోషాంన = యువలినివలె; అభ్యేతి = అనుసరించిపోవుచున్నాడు; యత్ర = ఏ ఉషఃకాలమునందు దేవయంతః = దేవయాగార్థము ధనమును కోరునట్టి; నరః = మనుష్యులు; యుగాని = కాడిమ్రాకులను; వితన్వతే = (కర్షణము కొరకు) విస్తరించుచున్నారో; (అట్టి ఉషస్సును అనుసరించిపోవుచున్నాడు.) భద్రం ప్రతి = (అట్టి) సూర్యుని గురించి; భద్రాయ = శుభము కొఱకు; (స్తుమః = స్తోత్రము చేయుచున్నాము.)
(ఋ. ౧-౧౧౫-౨)

భద్రా అశ్వా హరితస్సూర్యస్య చిత్రా ఏతగ్వా అను మాద్యాసః ॥
నమస్యంతో దివ ఆ పృష్ఠమస్థుః పరిద్యావా పృథివీ యంతి సద్యః ॥౩॥

తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యాకర్తోర్వితతం సంజభార ।
యదేదయుక్త హరితస్సధస్థాద్రాత్రీ వాసస్తనుతే సిమస్మై ॥౪॥

---

(పరమాత్మపరము) యథా = ఏరీతిగ; మర్త్యాః = మనుష్యులు; యోషాం = స్త్రీనిగురించి; అభిపశ్చాత్ = ముందుకువెనుకకు; ఏతి = పోవునో; తథా = అట్లు; రోచమానాం = ప్రకాశించు; ఉషసం = తమస్సును పోగొట్టుటచే ఉషశ్శబ్దవాచ్యురాలగు; 'దేవీం = ప్రసిద్ధమయిన భక్తిదేవిని; సూర్యః = జ్ఞానిప్రాప్యుడైన పరమాత్ముడు; అభ్యేతి = అనుసరించిపోవుచున్నాడు; యత్ర = ఏ యే పరమాత్మని యవతారములను; నరః = జనులు; దేవయంతః = పూజింపనిచ్ఛగలవారై; యుగాని = ఆయా కాలములందు విహితములైన కర్మలను; వితన్వతే = చేయుచున్నారో; (ఏవంవిధం = ఇటువంటి) భద్రంప్రతి = కల్యాణరూపుడైన పరమాత్మునిని; భద్రాయ = మంగళముకొరకు; (స్తుమః = స్తోత్రముచేయుచున్నాము.)

3. (సూర్యపరము) భద్రాః = మంగళకరములై వ్యాప్తిశీలములైన; హరితః = పచ్చనైన; చిత్రాః = విచిత్రములైన; అనుమాద్యాసః = క్రమముగా హర్షముపొందింపదగిన; సూర్యస్య = సూర్యునియొక్క; ఏతగ్వాః = అశ్వములు; నమస్యంతః = నమస్కారము చేయబడినవై; దివః = అంతరిక్షముయొక్క; పృష్ఠం = ఊర్ధ్వభాగమును; ఆ అస్థుః = పొందుచున్నవి; సద్యః = తత్క్షణమునందే; ద్యావాపృథివీ = భూమిని అంతరిక్షమును; పరియంతి = వ్యాపించుచున్నవి. (ఋ. ౧-౧౧౫-౩)

(పరమాత్మపరము) భద్రాః = మంగళకరులును; చిత్రాః = నానావిధములయినవారును; హరితః = హరిద్వర్ణముగలవారును; సూర్యస్య ఏతగ్వాః = పరమాత్మునితోగూడ సంచరించువారును; అనుమాద్యాసః = తారతమ్యక్రమముగ ఆనందముగలవారునగు; అశ్వాః = ముక్తులు; దివః పృష్ఠం = అంతరిక్షమునకు పైనుండు వైకుంఠమును; అస్థుః = పొంది; ద్యావాపృథివీ = అంతరిక్ష భూలోకములందు; (జనైః = జనులచేత) నమస్యంతః = నమస్కరింపబడుచు; పరియంతి = సంచరించుచున్నారు.

4 (సూర్యపరము) యత్ = ఏది; కర్తోః = కర్మయొక్క; మధ్యా = మధ్యమందు; వితతం = విస్తీర్ణమైన; (కిరణములను) సంజభార = ఉపసంహరించెనో; తత్ = అది; సూర్యస్య = సూర్యునియొక్క; దేవత్వం = స్వామిత్వము; తత్ = అది; మహిత్వం = మాహాత్మ్యము; యదాఇత్ = ఏకాలమునందు; సధస్థాత్ =